# IDIOMS & PHRASES IN ENGLISH

## ఇంగ్లీషు జాతీయములు మరియు పదబంధములు

T. రవికుమార్ B.Sc.





సరస్వతి పబ్లికేషన్

సత్యనారాయణ పురం, విజయవాడ - 11

# IDIOMS & PHRASES IN ENGLISH

by T. Ravikumar B.Sc.



FIRST EDITION :

*2002*

PAGE MAKERS :

*VISWA DIGITALS*
*Annapurna devi Street,*
*Gandhinagar, Vijayawada - 3*
*Ph. 400 023*

COVER DESIGN :

*N.V. Ramana*

PRINTED AT :

Ph : 664458, 664457
**KAMAKSHI WEB OFF SET**
VENKATESWARA RAO STREET, ELURU ROAD,
VIJAYAWADA - 2.

PUBLISHED BY :

SARASWATI PUBLICATION

*Satyanarana puram,*
*Vijayawada- 11*

*Price: Rs.* 20/-



# IDIOMS & PHRASES IN ENGLISH

## ఇంగ్లీషు జాతీయములు మరియు పదబంధములు

1. **ABOVE ALL** అన్నింటి కన్నా

   **'Above all'** character is a great virtue

   అన్నింటి కంటే వ్యక్తిత్వం (శీలం) గొప్పగుణము (సంపద)

2. **AFTER ALL** ఇంతకీ, ఎంతైనా

   **After all** blood is thicker than water, forgive her she is your daughter

   ఎంతైనా ఆమె నీ కూతురు, మన్నించు.

3. **ABOVE BOARD** ఎటువంటి లోపంలేని నిజాయితీ

   Very few politicians are **'above board'**

   కొంతమంది రాజకీయవేత్తలు మాత్రం నిజాయితీ గలవారు.

4. **'ALPHA' & 'OMEGA'** ప్రధాన ఉద్దేశం

   The **'Alpha' & 'omega'**of our party is to remove. poverty and thus usher a new era

   మాపార్టీ ప్రధానధ్యేయం పేదరికాన్ని రూపుమాపి నూతన శకాన్ని ప్రారంభించడమే.

5. **ALL IN ALL** (అన్నీ) ఒకరే

   'Basha is **all in all'** in the office

   బాషా ఆఫీసులో సర్వాధికారి.

6. **A TO Z** సమగ్రమైన జ్ఞానం, లేక అవగాహన కలిగి యుండుట

   He knows from **'A to Z'** in Astrology

   అతను జ్యోతిషంలో మంచి ప్రావీణ్యం వున్నవాడు.

7. **'ABC' OF ANY THING** సరియైన పరిచయం లేకుండుట.
Vasu does not know **'ABC'** in politics
వాసుకి రాజకీయాలు అంతగా తెలియవు.
Leela is just learning **'ABC'** in music
లీల యిప్పుడిప్పుడే సంగీతం నేర్చుకుంటున్నది.

8. **AT THE TOP OF ONE'S VOICE** ఎలుగెత్తి చాటు
Tilak slowted Independence **at the top of one's voice**
స్వాతంత్ర్యం కోసం తిలక్ ఎలుగెత్తి నినదించాడు.

9. **AT THE RISK OF** ప్రమాదం లెక్క చెయ్యక
Soldiars save the country **'At the risk** of their lives'
సైనికులు తమ జీవితాల్ని త్యాగం చేసి దేశాన్ని రక్షిస్తారు.

10. **AVAIL ONESELF OF AN OPPORTUNITY**
అవకాశమును ఉపయోగించుకొను.
He always **avails** himself of an opportunity
అతను ఎల్లప్పుడూ అవకాశాన్ని వినియోగించుకుంటాడు.

11. **AT THE HEIGHT OF ZENITH**
ఉచ్ఛ( అత్యున్నత మైన) స్థితిలో ఉండు
Now Abdul Kalam is **'at the height of zenith'**
ఇప్పుడు అబ్దుల్ కలామ్ ఉచ్ఛస్థితిలో వున్నారు.

12. **AT ARM'S LEANGTH** దూరంగా ఉంచు.
Keep internal enemies **'at arm's length'**
అంతః శత్రువుల్ని ఆమడ దూరంలో ఉంచు

13. **ACQUAINT ONE SELF WITH** పరిచయము కలిగివుండు.
He is not **'acquainted'** with litigations.
వివాదాలతో అతనికి పరిచయంలేదు.

14. **AT ONE'S FINGER'S TIPS** ఒక విషయంలో పరిపూర్ణమైన జ్ఞానం కలిగియుండి.
The mathematics is at my **finger's tips.**
గణిత శాస్త్రంలో నేను నిష్ణాతుణ్ణి

15. **AT ONE'S WIT'S ENDS** కలవరపడు
Madan was **'at his wits ends'** when be saw the bos sun expectedly.
యజమానిని అనుకోకుండా చూడగానే మదన్ కలవరపడ్డాడు.

16. **AT ALL EVENTS** ఏదిఏమైనానప్పటికీ
**'At all events** I must reach school before the bell
ఎట్టి పరిస్థితిలోను నేను గంట కొట్టక ముందే బడికి చేరాలి.

17. **AT ANY COST** ఎలాగైనా సరే,
You must get over the hurdles **'at any cost'**
ఎలాగైనా సరే, నీవు ఈ అవరోధాల్నుండి బయట పడాలి.

18. **AT ANY RATE** ఎలాగైనా సరే
They have to finish the work **'at any rate'**
ఎలాగైనా సరే, వారు పనిని పూర్తిచేయ్యాల్సి వుంటుంది.

19. **BURN ONE'S OWN FINGER** నష్టపోవు, చేతులు కాల్చుకొను
He **burn his finger** by depending on others
ఇతరులపై అధారపడి అతను చేతులు కాల్చుకున్నాడు.

20. **BED OF ROSES** గులాబీల పాన్పు (సుఖమైన)
You have know that 'life is not a **bed of roses'**
జీవితం గులాబీలపాన్పుకాదు అని నీవు తెలుసుకోవాలి.

21. **BENT UPON** నిర్ణయించుకొను.
He was **bent upon** to take a wrong step despite his well wishers
శ్రేయోభిలాషుల సలహాను లెక్కచెయ్యకుండా తప్పటడుగు వేశాడు.

22. **BY AND LARGE** మొత్తం మీద
**By and large** the game was a success
మొత్తం మీద ఆట విజయవంతం అయింది.

23. **'BY AND BY'** క్రమంగా
Patient has been improving **'by and by'**
రోగి క్రమంగా కోలుకుంటున్నాడు.

24. **BE AT A LOSS** ఏమీ తోచని పరిస్థితి
I am **'at loss'** to understand what he say.
అతను ఏమంటున్నాడో నాకు అర్థం కావటం లేదు.

25. **BLACK SHEEP** నమ్మక ద్రోహులు
There are **black sheep** in the organisation
ఆ సంస్థలో నమ్మక ద్రోహులున్నారు.

26. **ALL ROUND DEVELOPMENT** అన్ని రంగాలలో అభివృద్ధి
India acheived all round development after independence.
భారతదేశం స్వాతంత్ర్యానంతరం అన్ని రంగాలలో అభివృద్ధి చెందింది.

27. **AT SIXES AND SEVENS** గందరగోళ పరిస్థితి
Every thing was **at sixes and sevens** when teacher entered the class.
ఉపాధ్యాయుడు తరగతికి చేరే సరికి అంతా గందర గోళంగా ఉంది.

28. **ACT UP TO** మాట నిలబెట్టుకొను
At last he **'Acted upto'** his promises
చిట్ట చివరకు అతను మాట మీద నిలబడ్డాడు.

29. **BY HOOK OR CROOK** ఎలాగైనా సరే
I should get first class in exams **by hook or crook.**
ఎలాగైనా సరే నేను పరీక్షలలో ప్రథమ శ్రేణి సాధించాలి.

30. **BREAK DOWN** అస్తవ్యస్త పరిస్థితి
There was **break down** in the Factory after the death of owner
యజమాని మరణించడంతో ఫ్యాక్టరీ పరిస్థితి అస్తవ్యస్తంగా మారింది.

31. **LAVISHLY** దుబారాగా, విచ్చల విడిగా
Murali spends his earnings **'lavishly'** on tours
మురళి తన సంపాదనను విహార యాత్రలకు విచ్చల విడిగా ఖర్చు పెడతాడు.

32. **BE UNDER A CLOUD** సందేహాస్పదంగా వుండు
His words are **be under a cloud**
అతని మాటలు సందేహాస్పదంగా ఉన్నాయి

33. **BLOW ONE'S OWN TRUMPET** ఆత్మస్తుతి
It is a bad habit to **blow one's own trumpet**
ఆత్మస్తుతి చేసుకోవడం దురలవాటు

34. **BE A TOOL IN THE HANDS** ఒకరి చేతిలో కీలుబొమ్మ
The king has be come **a tool in the hands** of the minister.
రాజు మంత్రి చేతిలో కీలుబొమ్మ అయ్యాడు.

35. **BY LEAP AND BOUNDS** త్వరగా, వేగంగా
Tejpal is progressed **by leaps and bounds** in profession
తేజ్‌పాల్ వృత్తిలో మంచి అభివృద్ధిని సాధించాడు.

36. **BEAT ABOUT THE BUSH** డొంక తిరుగుడు సమాధానం
Don't **beat about the bush**, tell me the truth
డొంక తిరుగుడు మాని నాకు నిజం చెప్పు.

37. **BURN MIDNIGHT OIL** తెల్లవార్లు కష్టపడి చదువు
Pupil generally burn their **mid night oil** at the time of exams.
సాధారణంగా పరీక్షల సమయంలో విద్యార్థులు తెల్లవార్లు చదువుతారు.

38. **BURN THE CANDLE AT BOTH ENDS** విపరీతంగా ఖర్చు చేయు
It is hazardions to **burn the candle at the both ends** of the money
యిష్టం వచ్చినట్లు డబ్బు ఖర్చుచేయడం ప్రమాదకరం

39. **BRING TO BOOK** చట్టరీత్యా చర్యగైకొను
It is important to **bring to book** all militants to get peace in kashmir
కాశ్మీరులో శాందతి కోసం తీవ్రవాదుల మీద చట్టరీత్యా చర్య తీసుకోవడం ముఖ్యం

40. **BY THE BY** అన్నట్లు
**By the by** what is your opinion
అన్నట్లు నీ ఉద్దేశ్యం ఏమిటి?

41. **BY ALL MEANS** అన్ని విధముల
I wished his progress **by all means.**
నేను అన్ని విధాలా అతని అభివృద్ధిని కాంక్షించాను

42. **BREAK THE ICE** చొరవచూపు, మౌనము వీడనాడి మాటలు ప్రారంభించు
When every one is silent we must **break the ice** by taking the initiative.
అంతా మౌనంగా ఉన్నప్పుడు మనమే చొరవ చూపాలి

43. **BONE OF CONTENTION** తగాదాకు ప్రధానమైన కారణం
This site is the **'bone of contention'** between them
వారి మధ్య తగాదాకు ఈ స్థలమే ప్రధానమైన కారణం.

44. **BAG AND BAGGAGE** సరంజామా, మూటముల్లే
The British left our country with their **'bag and baggage'** after independence.
స్వాతంత్ర్యానంతరం (ఆంగ్లేయులు) తమ సరంజామా సర్దుకొని దేశం విడిచి వెళ్ళారు.

45. **BY FITS AND STARTS** మధ్యమధ్య, ఆగిఆగి
If you do any work by fits and starts it is not possible to succeed.
పని మధ్యమధ్య ఆపుచేస్తూ ఉంటే, నీవు విజయం సాధించడం సాధ్యంగాదు.

46. **BRING TO LIGHT** వెలుగులోనికి వచ్చు, వెల్లడియగు
His mistakes were **brought to light.**
అతని తప్పులన్నీ బయటపడ్డాయి.

47. **BUILD CASTLES IN THE AIR** ఊహా సౌధాలు (గాలిమేడలు) నిర్మించు
Pakisthan is **building castles in the air** to occupy the kashmir.
కాశ్మీర్‌ను ఆక్రమిద్దామని పాకిస్థాన్ గాలి మేడలు కడుతోంది.

48. **BECK & CALL** చెప్పుచేతలో వుండు
He is not at your **'beck & call'** as he is not your servant.
అతను నీ చెప్పుచేతల్లో ఉండటానికి నీ సేవకుడు కాదు

49. **BREAD AND BUTTER** జీవనాధారం (ఆహారం)
The poor fellow strugguling for **'bread and butter.**
ఆ బీదవాడు ఆహారం కోసం పరితపిస్తున్నాడు

50. **WITH A SILVER SPOON** సంపన్న కుటుంబంలో జన్మించు.
Abdul kalam was not born **with a silver spoon** in his mouth
అబ్దుల్ కలామ్ సంపన్న కుటుంబంలో జన్మించలేదు.

51. **BODY AND SOUL** మనస్ఫూర్తిగా
Put your **'body and soul'** in your studies in order to get good marks.
మంచి మార్కులు సాధించాలంటే మనస్ఫూర్తిగా చదువు

52. **BEYOUD DOUBT** నిస్సందేహంగా
It is **beyond doubt** of his victory in elections.
అతను ఎన్నికల్లో నిస్సందేహంగా గెలుచును.

53. **BEYOND MEASURE** వర్ణించలేనంతగా
Kiran was jubiliant **beyond measure** when he won the international chess title.
అంతర్జాతీయ చెస్ టైటిల్ గెలిచినందుకు కిరణ్ అంతులేని సంతోషంగా ఉన్నాడు.

54. **BLACK & BLUE** తీవ్రంగా

The thief was beaten 'black & bule' by the people.

జనం చేత దొంగ చావచితక్కొట్టబడ్డాడు.

55. **BE ALL AND END ALL** పరమావధి

Earning money only is not **be all and end all**

డబ్బు సంపాదన ఒక్కటే పరమావధి కాదు.

56. **CALL ON** మర్యాదగా కల్సుకొను

The Chief minister **called on** the Saibaba one his visit to Puttaparthy.

పుట్టపర్తికి వచ్చినప్పుడు ముఖ్యమంత్రి సాయిబాబాను మర్యాద పూర్వకంగా కలుసుకున్నారు.

57. **POT CALLS THE KETTLE BLACK**

తమలో లోపం పెట్టుకొని యితరులను విమర్శించు

Some people who have blemishes of their own criticise other like **'Pot calls the kettle black'**

తమలో లోపాలు ఉంచుకొని యితరులను విమర్శించటం అంటే కుండ టీ కాచే పాత్రను నల్లగా ఉంది అనటం లాంటిది.

58. **CALL A SPADE A SPADE** ఉన్నది ఉన్నట్లుగా చెప్పు

Ravi is not afraid to **Call a spade a spade.**

ఉన్నది ఉన్నట్లుగా చెప్పడానికి రవి ఎన్నడూ వెనకాడడు.

59. **CHIP OF THE OLD BLOCK** అన్ని విధాలా పోలివుండు

Calf is not **Chip of the old block** she is alike cow in all respects.

దూడ అన్ని విధాలా ఆవును పోలివున్నది.

60. **COME TO BLOWS** పోట్లాటకు సిద్ధపడు

The brothers **Come to blows** over a tiny mis under standing.

చిన్న అవగాహన లోపం వల్ల సోదరులు తగాదాలకు సిద్ధపడ్డారు.

61. **EYE WASH** కంటి తుడుపు

The contributon of the rich for orphans is only an **Eye wash.**

ధనికులు అనాధలకు చేసే సాయం కంటి తుడుపు మాత్రమే.

62. **CROCODILE TEARS** మొసలి కన్నీరు (నటించు)

Some people 'shed **crocodile tears**' over others sufferings.

కొందరు యితరుల కష్టాలు చూసి మొసలి కన్నీరు కారుస్తారు.

62. **CALL IN QUESTION** విమర్శించు
Patel was never **called in Question** of his honesty.
పటేల్ ఎన్నడూ తన నిజాయితీ విషయంలో విమర్శలకు గురికాలేదు.

63. **BE TAKEN ABACK** నిర్ఘాంత పోవు
I was **taken aback** when the Rat caught the snake.
ఎలుక పామును పట్టుకుంటే నేను ఆశ్చర్యపోయాను.

64. **CUT A SORRY FIGURE** సిగ్గుపడు, చిన్న బుచ్చుకొను
The student **cut a sorry figure** when he was found copying
ఒక విద్యార్థి కాపీ చేస్తూఉండగా, పట్టుబడి తెల్లమొహం వేశాడు.

65. **ON THE SPOT** అక్కడి కక్కడే
Take right step **on the spot**
అక్కడి కక్కడే సరైనచర్య తీసుకో

66. **CATCH RED HANDED** నేరం చేస్తూ ఉండగా పట్టుకొను
The thief was **caught red handed** by the police
దొంగ పోలీసులకు దొంగతనం చేస్తూ దొరికి పోయాడు.

67. **CRY IN THE WILDERNESS** అరణ్యరోదనము
The demand of an enquiry on the misuse of rice by the Congress was a **Cry in the wilderness.**
ధాన్యం అక్రమ వినియోగం విషయంలో విచారణ జరపాలని చేసిన కాంగ్రెస్ డిమాండ్ అరణ్యరోదనం అయింది.

68. **COME ROUND** లొంగిపోవు
Militants **come round** before the army with their arms.
తీవ్రవాదులు తమ ఆయుధాలతో సైన్యం ముందు లొంగిపోయారు.

69. **COME ABOUT** సంభవించు
It's a mystery how this has **come about**
ఇది ఎలా సంభవించిందో అర్థం కావటంలేదు.

70. **CARRY OUT** నెరవేర్చు
**Carry out** your duties & obligations with dedication
నీ విధులు, బాధ్యతలు అంకిత భావంతో నిర్వహించు.

71. **CARRY ON** కొనసాగించు
**Carry on** your business.
నీ వ్యాపారాన్ని కొనసాగించు.

72. **CALL FOR** అడుగు, కోరు (అధికారపూర్వంగా)
Rajesh was **Called for** an explanation for the negligence.
నిర్లక్ష్యం వల్ల రాజేష్‌ను సంజాయిషీ అడిగారు.

73. **DO AWAY WITH** వదిలించుకొను.
The dowry system, a social evil should be done **away with**
సామాజిక దురాచారం అయిన కట్నాన్ని నిర్మూలించాలి.

74. **DASH ONE'S HOPES** ఆశ నిరాశ అగు
Chandu's hopes were **dashed upon** when he failed in entrance test.
ప్రవేశ పరీక్షలో తప్పినందువల్ల చందూ ఆశలన్నీ నిరాశలైనాయి.

75. **TO CRAM IN** కంఠస్తము చేయు
Students **cram in** just before the answers
విద్యార్థులు పరీక్ష ముందు హడావిడిగా జవాబులు కంఠస్తం చేస్తారు.

76. **CAST A SLUR UPON** పరువు నష్టం కలిగించు
Some people won't hositate to **cast a slur upon** prominent persons.
కొంతమంది పేరు ప్రతిష్టలు ఉన్నవారిని అపఖ్యాతి పాలుచేయటానికి వెనుకాడరు.

77. **CHEW THE CUD** ఆలోచించు, నెమరు వేయు
Genious people often **chew the cud**.
మేధావులు ఎప్పుడూ ఆలోచిస్తూ ఉంటారు.

78 **CAPITAL PUNISHMENT** మరణ శిక్ష
The culprits who have assasinated Rajiv Gandhi, were awarded **capital punishment**.
రాజీవ్ గాంధీ హత్య చేసిన వారికి మరణ దండన విధించబడింది.

79. **CAPITAL ERROR (BLUNDER)** పెద్ద తప్పు
You can escape punishment even after making **a capital error.**
ఎంత పెద్ద తప్పు చేసినా నీ దగ్గర అధికారం ఉంటే తప్పించుకోగలవు.

80. **COCK & BULL STORY** కాకమ్మ కథ, కట్టుకథ
Don't tell me **cock & bull story**.
కాకమ్మ కథలు చెప్పకు

81. **CALL NAMES** నిందించు
Don't **call** your parents
నీ తల్లి దండ్రులను నిందించకు

82. **CUT ONE SHORT** మాట్లాడుతూ ఉండగా అడ్డుతగులు
The minister was forced to **cut short** his speech by the unruly mob agitating on some issues.
కొన్ని సమస్యలపై ఆందోళన జరుపుతున్న ఆందోళన కారుల కారణంగా మంత్రి తన ఉపన్యాసాన్ని విరమించెను.

83. **FLASH BACK** జరిగిపోయిన సంగతి.
Don't bore me with **flash back** stories
జరిగిపోయిన కథలు చెప్పి నన్ను విసిగించకు.

84. **FOR WANT OF** కొరత, అవసరం
I could not attend the marriage **for want of** meeting
సమావేశం వున్నందు వల్ల నేను పెళ్ళికి హాజరుకాలేకపోయాను.

85. **ANOTHER FISH TO FRY** వేరే పని ఉండు
He has **another fish to fry** let him go
అతనికి వేరే పని వుంది వెళ్ళనీ!

86. **FISH OUT OF WATER** ఆసక్తి లేక పోవు, ఆసక్తి కనబరచకపోవు
I have no **Fish out of water** of politics.
నాకు రాజకీయాలపై ఆసక్తిలేదు.

87. **FISH IN TROUBLED WATER** లాభం పొందు
Some people try to Fish in troubled waters.
కొంతమంది యితరుల యిబ్బందుల నుండి లాభం పొందాలని చూస్తారు.

88. **SMOKE WITH OUT FIRE** నిప్పులేకుండా పొగరాదు
There is no **Smoke with out fire.**
నిప్పులేకుండా పొగరాదు.

89. **END IN SMOKE** వృధా అగు, తుస్సుమను
All his efforts **ended of smoke** to become Boxer.
బాక్సర్‌ని కావాలనే అతని ప్రయత్నాలన్ని వృధా అయినాయి.

90. **ELEVENTH HOUR** చివరి క్షణంలో
We the reached the rialway station at the **eleventh hour.**
మేము చివరి నిముషంలో రైల్వే స్టేషన్ చేరుకున్నాము.

91. **DEFEAT THE PURPOSE** అరచిన ప్రయోజనం దెబ్బతిను
Some schemes launched by the Goverment **defeated the very purpose** of helping the poor due to lack of proper imprementation.
తగిన చర్యలు తీసుకోని కారణంగా, ప్రభుత్వం ప్రారంభించిన పథకాలు వాటి ప్రయోజనమే దెబ్బతింటున్నది.

92. **GO THROUGH** పరిశీలించు, (చదువు)
**Go through** the text you can know better
పాఠ్య పుస్తకాన్ని చదువు నీకు మరింత బాగా అర్థం అవుతుంది.

93. **GET THROUGH** ఉత్తీర్ణత సాధించు
Rani **got through** the examination
రాణి పరీక్షలో ఉత్తీర్ణత సాధించింది.

94. **FROM FRYING PAN IN TO THE FIRE** ఒక ఆపద నుండి మరొక
His condition is now as **from frying pan in to the fire**
అతని పరిస్థితి యిప్పుడు పెనం మీంచి పొయ్యిలో పడ్డట్టుగా వుంది.

95. **FAR AND WIDE** అంతటా, ఎల్లెడలా
His fame spread **far and wide**
అతని ఖ్యాతి దశదిశలా వ్యాపించింది.

96. **FACE TO FACE** ముఖా ముఖి
We are discussintg our lesson **Face to face.**
మేము మా పాఠాన్ని ముఖాముఖీ చర్చించుకుంటున్నాము.

97. **TO FACE** ఎదుర్కొను
We have to face any challenge.
మనం ఏ సమస్యనైనా ధైర్యంగా ఎదుర్కోవాలి.

98. **FROM HEAD TO TOE** నఖ శిఖ పర్యంతం (పూర్తిగా)
He was hot (drenched) **From head to toe**
అతను నఖశిఖ పర్యంతం కోపంతో రగిలిపోతున్నాడు.

99. **FROM HAND TO MOUTH** కష్టంగా, చాలీచాలని
He is living with salary **from hand to mouth**
అతను చాలీచాలని జీతంతో జీవిస్తున్నాడు.

100. **FALL A PREY TO** బలిఅగు
Don't **Fall a prey to** others traps
ఇతరుల వలలో పడి మోసపోవద్దు.

101. **IN THE NICK OF TIME** సమయానికి (సరియైన)
They went **In the nick of time**
వాళ్ళు సరిగ్గా సమయానికి వెళ్ళారు.

102. **In vain futile** వృధా ప్రయాస, వ్యర్థప్రయత్నం
All his efforts went **In vain futile**
అతని ప్రయత్నాలన్నీ వృధా అయ్యాయి.

103. **HITHER & THITHER** అక్కడక్కడ, చెల్లాచెదురుగా
Why are you wandering **Hither & thither?**
ఎందుకు నువ్వు అటుయిటు తిరుగుతావు?

104. **TAKE THE BULL BY THE HORN** అవకాశమును వినియోగించుకో
**Take the bull by the horn** other wise you have to loose the chance.
అవకాశాన్ని సద్వినియోగం చేసుకో, లేకపోతే అవకాశాన్ని వదులుకోవలసి వస్తుంది.

105. **HOLD GOOD (WATER)** వర్తించు, బలం
Your argument has **Hold good (water)**
నీ వాదనలో బలం వుంది.

106. **HIT THE NAIL ON THE HEAD** ఖచ్చితంగా వ్యవహరించు
Chairman has the talent to **Hit the nail on the head** in the house.
సభలో ఖచ్చితంగా వ్యవహరించే నేర్పు ఛైర్మన్‌గారికి వుంది.

107. **HIDE & SEEK** దాగుడుమూత
Life is a game of **Hide & seek.**
జీవితం ఒక దాగుడుమూతలాట.

108. **HEAVY HEART** వేదనతో, భారముగా
Rafi went to Vizag with **Heavy heart.**
రఫీ బాధగా వైజాగ్ వెళ్ళాడు.

109. **HAVE AN AXE TO GRIND** లాభము పొందు
Every one has his **axe to grind.**
ప్రతివాడికి స్వలాభం (స్వార్థం) ఉంటుంది.

110. **HARD NUT TO CRACK** కొరుకుడుపడని
His son is a **Hard nut to crack.**
అతని కొడుకు మహామొండి.

111. **HAVE A HAND IN** ప్రమేయము ఉండు
Swathi has a **Have a hand in** the dealing.
స్వాతికి వ్యవహారంలో ప్రమేయం ఉంది.

112. **INTRUDE UPON** లోనికి చొరపడు
Don't **Intrude upon** other effaris.
ఇతరుల వ్యవహారాల్లో జోక్యంచేసుకోకు.

113. **SUPERIORITY COMPLEX** ఆధిక్యతాభావము
**Superiority complex** ultimately leads to 'ego'
ఆధిక్యతాభావం, చివరికి 'అహం'గా పరిణమిస్తుంది.

114. **INFERIORITY COMPLEX** న్యూనతాభావం
**Inferiority complex** mars your personality.
న్యూనతాభావం, వ్యక్తిత్వాన్ని దెబ్బతీస్తుంది.

115. **INS & OUTS** రహస్యములు
The **Ins & outs** of the whole affair should come to light.
ఆ వ్యవహారం అంతా బట్టబయలు కావాలి.

116. **IN A NEET SHELL** సంక్షిప్తంగా
Tell me **In a nut shell** of the incident happened.
ఆ సంఘటన గురించి క్లుప్తంగా చెప్పు.

117. **IN THE AIR** అమలుకాకపోవు
New propose has not been implemented, still it is **in the air**.
కొత్త ఆలోచన అమలుకాలేదు. ఇంకా అమలుకు నోచుకోలేదు.

118. **GIVE VENT TO** యిచ్చు, లోనగు
Don't **Give vent to** emotion.
భావావేశానికి లోనుగాకు.

119. **IN THE EVENT OF** సందర్భంలో
**In the event of** your birth day we congratulate you.
నీ జన్మదిన సందర్భంగా మేము నిన్ను అభినందిస్తున్నాము.

120. **IN THE WAKE OF**వెంటనే, సమయంలో

Srinu was disappoined **in the wake of** results.

ఫలితాలు వెలువడిన సందర్భంలో శ్రీను నిరాశ చెందాడు.

121. **IN HIGH SPIRITS** ఉల్లాసంగా

He is **In high spirits.**

అతను మంచి ఉత్సాహంగా ఉన్నాడు.

122. **IN THE LONG RUN** చివరిలో, ఆఖరుకు

There will may be good results **In the long run.**

చివరకు మంచి ఫలితాలు వుంటాయి.

123. **HAND IN GLEVE** ఒక్కటిగా, కలిసిపోవు

Hasan & Hussain are in **Hand in gleve.**

హసన్, హుస్సేన్‌లకు ఒప్పందంలో సంబంధం వుంది.

124. **KEEP UP** కొనసాగించు

**Keep up** the same spirit.

అదే ఉత్సాహాన్ని కొనసాగించు.

125. **KEEP AN EYE ON**దృష్టిని కేంద్రీకరించు

**Keep an eye on** the border orered the major.

సరిహద్దుపైన దృష్టిని కేంద్రీకరించండి అని మేజర్ అనుజ్ఞ యిచ్చాడు.

126. **KEEP THE BALL ROLLING** సంప్రతింపులు కొనసాగించు

Both parties should **Keep the ball rolling** to get a settlement.

ఒక ఒడంబడిక కుదరటానికి యిరు పక్షాలు చర్చలు కొనసాగించటం అవసరం.

127. **KEEP ABREAST - KEEP PACE WITH** ముందంజవేయు

The player is unable to **Keep abreast - keep pace with** other players.

ఆ ఆటగాడు ఇతర ఆటగాళ్ళతో పోటీ పడలేకపోతున్నాడు.

128. **KNOW NO BOUNDS** ఆనందానికి హద్దులేకపోవు

His joy **knew no bounds** when he came to know of the results.

అతని ఫలితాలు తెలియగానే సంతోషానికి అవధులు లేవు.

129. **SPELL BOUND** మంత్రముగ్ధులగు

The audiences were **Spell bound** when Iswarya Rai gave them audiance.

ఐశ్వర్యరాయ్‌ని చూడగానే ప్రేక్షకులు మంత్రముగ్ధులైనారు.

130. **JACK OF ALL TRADES** అన్ని పనులు చేసేవాడు
**Jack of all trades** is like a 'rolling stone'.
అన్ని వ్యాపారాల్లో వ్రేలు పెట్టేవాడు తిరిగే బండలాంటివాడు.

131. **INSPIT OF** అయినప్పటికినీ
**Inspite of** his hard work he could not pass the exam.
ఎంతో కష్టించి పనిచేసినా, అతను పరీక్షలో విజయం పొందలేక పోయాడు.

132. **IRONY OF FATE** విధివిలాసం
No body can change the **'Irony of fate'**.
విధిని ఎవ్వరూ మార్చలేరు.

133. **LOOK DOWN UPON** తక్కువగా చూచు
Juniors feel that they were **looked down upon** by the seniors.
చిన్నవాళ్ళని పెద్దవాళ్ళు తక్కువగా చూస్తున్నారని భావిస్తున్నారు.

134. **LET OFF** వదిలివేయు
The thief was **let off** after grabbing
చివాట్లు పెట్టిన అనంతరం దొంగని వదిలేశారు.

135. **LEAVE NO STONE UNTURNED** అన్ని విధముల ప్రయత్నించు
Pavan **left no stone unturned** to secure a job.
ఉద్యోగం సంపాదించటానికి పవన్ చెయ్యని ప్రయత్నమంటూ లేదు.

136. **KNOW WHAT IS WHAT** వాస్తవమును గ్రహించు
First **Know what is what** before you come to a conclusion.
ఒక నిర్ణయానికి వచ్చే ముందు అసలు విషయాన్ని తెలుసుకో

137. **KILL TIME** కాలక్షేపం చేయు
Some people watch movies just to **kill time.**
కొందరు కేవలం కాలక్షేపానికి సినిమాలు చూస్తారు.

138. **KEEP ONE'S WORD** మాటనిలబెట్టుకొను
King Harischandra **kept his word** given to rishi Viswamitra.
హరిశ్చంద్ర మహారాజు విశ్వామిత్రునికి యిచ్చిన మాటతప్పలేదు.

139. **KEEP IN TOUCH WITH** సంబంధం కలిగియుండు
**Keep in touch with** the innocent friend.
అమాయకుడైన ఈ స్నేహితునితో సంబంధం కల్గివుండు.

140. KITH & KIN బంధువులు, పిల్లాజల్లా
He came to marriage with his **kith & kin.**
అతను తన పిల్లా జల్లాతో సహా పెళ్ళికి వచ్చాడు.

141. MORE OR LESS ఇంచుమించు
It is **More or less** the same
ఇంచుమించుగా అది ఒకటే.

142. MICE MATRTERS నీళ్ళు నమలు
Don't **Mice matrters** come straight to the point.
నీళ్లు నమలకు తిన్నగా అసలు విషయానికిరా.

143. MAKE AMENDS సరిదిద్దుకొను
There is no time to **make amends.**
పొరపాట్లు సరిదిద్దుకోవటానికి సమయంలేదు.

144. MAKE A FUSS హంగామా, రాద్ధాంతంచేయు
Don't **make a fuss** over silly things.
చిన్న విషయాల విషయంలో రాద్ధాంతంచేయు.

145. NONE OF YOUR BUSINESS నీకు సంబంధంలేదు
**None of your business** keep quite.
నీకు ఎటువంటి సంబంధంలేదు, మాట్లాడవద్దు.

146. MEND YOUR WAYS పద్ధతులు మార్చుకొను
It is to **mend your ways** the right time.
నీ పంథా (పద్ధతి) మార్చుకోవటానికి ఇది సరైన సమయం.

147. MIND ONE'S BUSINESS తన పని తాను చూసుకొను
**Mend your own business** Don't interfere in this issue.
నీ పని నీవు చూసుకో ఈ విషయంలో కల్పించుకోవద్దు.

148. AS A MATTER OF FACT వాస్తవానికి, నిజానికి
**As a matter of fact** he was not there when the incident happend.
వాస్తవానికి, ఈ సంఘటన జరిగినప్పుడు అతను అక్కడలేదు.

149. MAKE BOTH ENDS MEET ఖర్చు తగ్గించుకొను
It is difficult to **make both ends meet**.
ఈ పరిస్థితిలో ఖర్చు తగ్గించుకోవడం కష్టం.

150. **LET THE CAT OUT OF THE BAG FIRST**

అసలు విషయము బయట పడనీ

**Let the cat out of the bag first** Don't get irritated.

ముందు పిల్లిని సంచిలోనుంచి బయటికిరానీ, అసలు సంగతి తెలియనీ అప్పటి వరకు ఆవేశపడకు.

151. **LOOK FORWARD TO** ఎదురుచూచు, నిరీక్షించు

He is **looking forward** eagerly to see her.

ఆమెను చూడాలని అతను ఆతృతతో ఎదురుచూస్తున్నాడు.

152. **NIP IN THE BUD** మొగ్గలోనే త్రుంచివేయు

Every hurdle must be **nipped in the bud.**

ప్రతి అవరోధాన్ని మొగ్గలోనే త్రుంచివేయ్యాలి.

153. **LACK OF UNDERSTANDING** అవగాహనలేకపోవు

**Lack of understanding** is root of problems between wife and husband.

భార్యభర్తల మధ్య సమస్యలకు మూలం అవగాహనలోపం.

154. **NO LOVE LOST** ద్వేషించు

There is no **No love lost** between them

వారి మధ్య సత్సంబంధాలులేవు.

155. **MATTER OF COURSE** మామూలు విషయం

It's **Matter of course**

అది మామూలు విషయం.

156. **MAN OF PRINCIPLES** సిద్ధాంతాలకు కట్టుబడి యుండు

Ganghdiji was a **Man of principle** in politics.

గాంధీజీ రాజకీయాల్లో సిద్దాంతాలకు కట్టుబడేవారు.

157. **MAN OF WORD** నిజాయితీగల, మాటతప్పని.

He is a **Man of word.**

అతను మాటమీద నిలబడే వ్యక్తి.

158. **MAKE MUCH OF** అతిశయోక్తిచేయు

Don't **Make much** out of nothing.

ఏమీలేనిదానికి, గోరంతలు కొండంతచెయ్యకు.

159. **MAKE OUT** గ్రహించు, అర్థంచేసుకొను
I could not **make out** your letter.
నీ ఉత్తరంలోని సంగతులు నాకు అర్థంకాలేదు.

160. **MOVE HEAVEN & EARTH** విశ్వప్రయత్నము చేయు
He **moved heaven & earth** to get the work done.
అతను ఆపని పూర్తి చెయ్యడానికి విశ్వప్రయత్నం చేశాడు.

161. **MAKE A FOOL OF** దద్దమ్మను చెయ్యకు
**Don't make fool** others
ఇతరులను తెలివి తక్కువ దద్దమ్మలుగా చెయ్యకు.

162. **OF A HIGH ORDER** మిక్కిలి ప్రధానమైన
India's Himalayas is **of a high order** in the world.
భారతదేశపు హిమాలయాలకు ప్రపంచంలో మంచి పేరుంది.

163. **ON THE EVE OF** సందర్భంగా
Huge Vinayaka Idols were installed **on the eve of** Vinayaka chavithi.
వినాయక చవితి సందర్భంగా భారీ వినాయక విగ్రహాలు ప్రతిష్టింపబడ్డాయి.

164. **ONCE FOR ALL** శాశ్వతంగా
The case was closed **once for all.**
ఆ కేసు శాశ్వతంగా మూసివేయబడింది.

165. **HELTER & SKELTER** చిందర వందరగా
Every thing was **Helter & skelter** when we went there.
మేము అక్కడికి వెళ్ళేసరికి అంతా అస్తవ్యస్తంగా ఉంది.

166. **OVER HAED & EARS** తలమునగ, నిండుగా, పూర్తిగా
The trader is **over head & ears** in debts.
ఆ వ్యాపారి అప్పుల్లో నిండా మునిగి ఉన్నాడు.

167. **OUT OF THE CONTEXT** అసందర్భం
Pakistans insistence on only Kashmir issue is **Out of the context**.
కాశ్మీర్ సమస్యపైనే పాకిస్థాన్ పట్టుపట్టడం అసందర్భం.

168. **OUT OF QUESTION** అసాధ్యం
Settlement between the two parties is **Out of question.**
ఆ రెండు వర్గాల మధ్య ఒప్పందం కుదరడం అసాధ్యంగా కనిపిస్తోంది.

169. **CLOSE THE CHAPTER** అధ్యాయం ముగింపు

The discussions between India and Pakistan is not a **Closed chapter**

భారత- పాకిస్థాన్‌ల మధ్య కాశ్మీర్ సమస్య ముగిసిన అధ్యాయం కాదు.

170. **OPEN A NEW CHAPTER** క్రొత్త అధ్యాయం (జీవితం) ప్రారంభించు

He **opened a new chapter** by starting a new business.

అతను కొత్త వ్యాపారం మొదలుపెట్టి నూతన జీవితాన్ని ప్రారంభిం చాడు.

171. **NEITHER HEAD NOR TAIL** అర్థం పర్థంలేని, తలతోక

His letter carrys (conveys) **Neither head nor tail.**

అతని ఉత్తరానికి తలాతోక లేదు.

172. **PRIME OF LIFE** యౌవన దశ

The youg girl died in her **prime of life.**

ఆ యువతి తన యవ్వన దశలో చనిపోయింది.

173. **PUT THE CART BEFORE THE HORSE** బండిని గుర్రం ముందు వుంచు

Some times he **puts the cart before the horse.**

అతను ఒక్కోసారి ఆలోచనలేని పనులు చేస్తుంటాడు.

174. **PULL TOGETHER** కొనసాగించు

The newly marries Vani and Kishore are **Pulling together.**

కొత్తగా పెళ్ళయిన వాణి కిషోర్‌లు మంచిగా సంసారాన్ని లాగుతున్నారు.

175. **PUT UP WITH** భరించు, సహించు

He **Put up with** the insult meted out to him.

అతనికి జరిగిన అవమానాన్ని భరించాడు.

176. **PICK HOLES** దోషములు ఎంచుట

Don't **Pick holes** in another's coat.

ఇతరులలో లోపములు ఎంచవద్దు.

177. **PART & PARCEL** అంతర్భాగము

Kashmir is a **Part & parcel** of India.

కాశ్మీర్ భారత్‌లో అంతర్భాగము.

178. **NAKED FACT** నగ్న సత్యం

It is a **Naked fact** that prices are increasing day by day.

రోజురోజుకూ ధరలు పెరుగుతున్నాయనేది నగ్న సత్యం

179 **OPEN SCERET** బహిరంగ రహస్యం.

It is a **Open sceret** that he has second family.

అతనికి మరో కుటుంబం వుందన్నది బహిరంగ రహస్యం.

180. **OPEN HEART** దాపరికం లేకుండా

Vajapayie had talks with Pervez Mushraff with **Open heart.**

ప్రధాని వాజ్‌పేయి పెర్‌వేజ్ ముష్రాఫ్‌తో చాలాసార్లు దాపరికం లేకుండా చర్చలు జరిపారు.

181. **ON THE OTHER HAND** అందుకు భిన్నంగా

He has many other engegements **on the other hand.**

అతనికి మరో వైపు చాలా వ్యాపకాలు వున్నాయి.

182. **RUN SHORT** తగ్గిపోవు

Water resources are **running short** due to draught

కరువు వల్ల నీటి వనరులు తరిగిపోతునాన్నయి.

183. **RANK & FILE** సామాన్యజనం

This custom of bribe is prevalent among the **Rank & file.**

లంచం అనే దురాచారం అందరిలోను ఉంది.

184. **RAISE A HUE & CRY** గగ్గోలు పెట్టు

She oftenly **Raise a hue & cry.**

ఆమె తరచుగా గగ్గోలు పెడుతున్నది.

185. **THE DEVIL QUOTES THE SERIPTURES** దయ్యాలు వేదాలు వల్లించినట్లు

His advice is like **the devil quotes the seriptures.**

అతని సలహా 'దయ్యాలు వేదాలు వల్లించినట్లు' ఉంది.

186. **IN QUEST OF** అన్వేషణలో

Ravi went to Bombay **In quest of** an employment.

రవి ఉద్యోగ అన్వేషణలో బొంబాయి వెళ్ళాడు.

187. **PULL ON** కొనసాగించు

He is **Pulling on** well with his business.

అతను బాగానే వ్యాపారం చేస్తున్నాడు.

188. **PUT UP** బసచేయు

I **Put up** my self in Brindavan hotel when I went to Ooty.

నేను ఊటీ వెళ్లినప్పుడు 'బృందావన్' హోటల్‌లో బసచేసితిని

189. **PAY IN ONE'S OWN COIN** గుణపాఠం చెప్పు
The rabbit **Paid the lion in its own cion.**
కుందేలు సింహానికి తగిన గుణపాఠం చెప్పింది.

199. **POKE ONES NOSE** ఇతరుల వ్యవహారంలో జోక్యం చేసుకొను
Don't **poke your nose** in others affairs.
ఇతరుల వ్యవహారంలో తలదూర్చకు.

200. **BOLT THE STABLE AFTER THE HORSES FLED** గత జలసేతు బంధనం (నీరు పోయిం తర్వాత అడ్డుకట్ట వెయ్యడం)
His deed was just like **Bolt the stable after the horses fled.**
అతని చర్య గుర్రాలు శాలలో నుంచి బయటికి వెళ్ళిపోయింతర్వాత శాలకు గడియ పెట్టటంలాగా ఉంది.

201. **PICK UP** నేర్చుకొను, అభివృద్ధి సాధించు
Your girl is **picking up** slowly.
మీ అమ్మాయి నెమ్మదిగా అభివృద్ధి చెందుతున్నది.

202. **SQUARE MEAL** సంతృప్తి కరమైన భోజనం
You can satisfy a person eith a **square meal**
సంతృప్తి కరమైన భోజనం పెట్టి ఒక వ్యక్తిని మీరు తృప్తిపరచవచ్చు.

203. **SET ASIDE** త్రోసిపుచ్చు
The Supreme Court **set aside** the judgement of lower court.
సుప్రీంకోర్టు క్రింది కోర్టు తీర్పును త్రోసిపుచ్చెను.

204. **SCOT FREE** స్వేచ్ఛగా తిరుగు
Criminals should not **scot free** in our society.
మన సమాజంలో నేర చరిత్రగల వారు స్వేచ్ఛగా తిరగరాదు.

205. **RIDE ROUGH SHOD** దౌర్జన్యముగా, ఇష్టము వచ్చినట్లుగా
Leaders who are in power those are **riding round shod.**
అధికారంలో ఉన్న నాయకులు తమ యిష్టం ప్రకారం ప్రవర్తిస్తున్నారు.

206. **TURNING POINT** ప్రధానమైన మార్పు (మైలురాయి)
'Quit India' movement was the **'Turning point'** of the freedom struggle of our country.
'క్విట్ యిండియా' ఆందోళన (ఉద్యమం) స్వాతంత్ర్య పోరాటంలో ఒక మలుపు

207. **MILE STONE** ప్రధానమైన
26 Janury, 1950 is the **mile stone** for India.
1950, జనవరి 26 భారతదేశానికి ఒక మైలు రాయి.

208. **RED LETTER DAY** మరిచిపోలేని రోజు
15th August, 1947 is the **Red letter day** for Indians.
భారతీయులకు 1947, అగస్టు, 15వ తేదీ మరుపురాని సంఘటన

209. **REAP THE CONSEQUENCES** ఫలితం అనుభవించు
Every body must **Reap the consequences** of their actions.
ప్రతి ఒక్కరు తమ చర్యల ఫలితాల్ని అనుభవించాల్సి ఉంటుంది.

210. **RUN THE RISK OF** తెగించు, ధైర్యము చేయు
Climbing the mountain is nothing but **run the risk of.**
ఆ పర్వతాన్ని అధిరోహించడం ప్రాణాలకు తెగించడమే!

211. **RISE TO THE OCCASION** సమయం,సందర్భాన్ని అందుకోవాలి
We must **rise to the occasion**
మనం అవకాశాన్ని అందుకోవాలి.

212. **THROUGH THICK AND THIN** కష్టసుఖాల్లో
Husband and wife are expected to go a long way **Through thick and thin.**
భార్యాభర్తలు కష్టసుఖాలు పంచుకొని ఎంతో దూరం ప్రయాణం చేయాల్సి ఉంటుంది.

213. **TAKE PLACE** సంభవించు
A earth quake **took place** in Maharastra recorded on rectorscale cousing heavy loss in catcer.
మహారాష్ట్రలో (లాతూరు) జరిగిన ఘోరమైన భూకంపం తీవ్రనష్టం కలిగించింది.

214. **TO AND FRO** రానుపోను
He paid the fare **To and fro** at a time.
రానుపోను రుసుమును అతను ఒకేసారి చెల్లించాడు.

215. **STONE'S THROW** సమీపంలో, దగ్గర్లో, అందుబాటులో
The Hospital is a **Stone's throw.**
హాస్పటల్ దగ్గరలోనే వుంది.

252. **WEAR & TEAR** అరుగుదల

The period of **wear and tear** of some articles does not lastlong.

కొన్ని వస్తువుల నాణ్యత ఎక్కువ కాలం ఉండదు త్వరలోనే అరుగుదలకు గురి అవుతాయి

253. **WHITE ELEPHANT** వృధాఖర్చు, భారమైన పథకం

Some departments have become **white elephant** to Government.

కొన్ని శాఖలు ప్రభుత్వానికి భారంగా పరిణమించినాయ్.

254. **WIND UP** రద్దుచేయు

It is better to **wind up** your business.

నీ వ్యాపారం మూసి వేయడం మంచిది.

255. **WELL TO DO** సంపన్నమైన

Relianice is a **well to do** company in India.

రిలయన్స్ కంపెని భారతదేశంలో సంపన్నమైనది.

256. **PANDRE'S BOX** సమస్యల పుట్ట

Don't open the **pandre's box.**

సమస్యల పుట్టని తెరవ వద్దు.

257. **GOOD SAMARITAN** ఆపద్భాంధవుడు

When he is in trouble a **good samaritan** came to his rescue.

అతను కష్టాల్లో, ఉన్న సమయాల్లో ఒక ఆపద్భాంధవుడు వచ్చి రక్షించాడు.

258. **SWORD OF DAMOCLES** మెడమీద కత్తి

A **Sword of Damocles** is hanging on the head of Salman Rashdi.

సల్మాన్‌రష్డీ మెడమీద కత్తి వ్రేలాడుతూ ఉంది.

259. **PUT IN COLD STORAGE** అమలుకాకుండా అటకెక్కించు.

33 percent seats reservation for women in parliament was **put in cold storage.**

స్త్రీలకు 33 శాతం రిజర్వేషన్ బిల్లు పార్లమెంట్‌లో అమలుకు నోచుకోలేదు.

260. **HUSH MONEY** కేసు మాఫీ చేయుటకు చెల్లించు డబ్బు

He spent **hush money** to hush up thecase.

అతను కేసు మాఫీకి డబ్బు ఖర్చు చేశాడు.

261. **HEN PECKED** భార్యా విధేయులు

**Hen pecked** husband is always an unsucessful loves.

భార్యావిధేయులు ప్రేమ వ్యవహారాల్లో సాధారణంగా విజయం సాధించలేరు.

262. **TO GIVE THE DEVIL HIS DUE (SHARE)**

లాభంలో కొంత అవతల వానికి యిచ్చు

The partner gave other his the **due (share)**

ఆ భాగస్వామి రెండవ భాగస్వామికి లాభంలో వాటాయిచ్చాడు.

263. **TO TIE THE GORDIAN KNOT** మూడుముళ్ళువేయు

Finally the lovers tied **the Gordian knot.**

ఆ ప్రేమికులు చివరికి మూడుముళ్లు వేసి ఒక యింటివారైనారు.

264. **A THORN IN ONE'S FLESH** మింగుడుపడని, అడ్డుతగులు

Kasmir is **a thorn in** Pakistan's flesh (meat)

పాకిస్థాన్ ఆహారంలో కాశ్మీర్ ముల్లులాంటిది. (అవరోధం)

265. **A HERCULEAN TASK** ఎంతో శ్రమతో కూడిన

It is **a herculean task** to swim the black sea.

నల్ల సముద్రాన్ని ఈదడం ఎంతో కష్టంతో కూడిన పని.

266. **TO BEAT A RETREAT** వెనుకకు మరలు

Pakistan solodiers **beat a retreat** when our Jawans answered suitably.

మన జవాన్లు తగిన జవాబు యిచ్చినందున పాకిస్థాన్ సైనికులు వెనక్కు తగ్గారు.

267. **TO HAVE TOO MANY IRONS IN THE FIRE** ఎన్నో పనులు ఉండు

We **have too many irons in the fire.**

మాకు యింకా ఎన్నో పనులున్నాయ్.

268. **TO BURY THE HATCHET** రాజీపడు

They **buried their hatchet** and became friends again.

వారు తమ పగ మరిచిపోయి తిరిగి స్నేహితులైనారు.

269. **TO TURN OVER A NEW LEAF** క్రొత్త జీవితం ప్రారంభించు

He has abstained from drinking and atlast a **turned over a new leaf.**

అతను త్రాగుడు మాని క్రొత్త జీవితాన్ని ప్రారంభించాడు.

**270. TO DIE IN HARNESS** పనిచేస్తూ (విధిలో) చనిపోవు
Lal Behadur **died in harness.**
లాల్ బహదూర్ శాస్త్రి దేశసేవలో చనిపోయెను.

**271. A MILLION DOLLAR QUESTION** అంతుపట్టని సమస్య
It is **a million dollar question** that why he has become mad.
అతను పిచ్చి వాడిగా ఎందుకు అయ్యాడో పెద్ద ప్రశ్నార్థంగా వుంది.

**272. HIMALAYAN BLUNDER** పెద్ద తప్పు
Hari feels that he has done (committed) a **Himalayan blunder** after he got married.
పెళ్లి చేసుకొని తాను పెద్ద తప్పు చేశానని హరి యిప్పుడు బాధపడు తున్నాడు.

**273. A BOTTLE NECK** ఆటంకము
For every scheme started (launched) by the Government there is certainly **A bottle neck.**
ప్రభుత్వం ప్రారంభించిన ప్రతి పథకానికి ఏదో అవరోధం ఏర్పడుతున్నది.

**274. BETWEEN THE DEVIL AND DEEP SEA** ముందు గొయ్యి వెనక గొయ్యి (సందిగ్ధావస్థ)
I was stuck **Between the devil and deep sea** whether to go to Australia or not.
నేను ఆస్ట్రేలియా వెళ్లటమా లేక వెళ్లకపోవటమా అనే సందిగ్ధంలో పడ్డాను.

**275. GET RID OF** వదిలించుకొను, దూరంగా ఉండు
You should **Get rid of** bad habits.
నీవు చెడ్డ అలవాట్లను వదిలించుకోవాలి.

**276. DIE HARD** త్వరగాపోవు
Bad habits **die hard.**
చెడ్డ అలవాట్లు త్వరగా పోవు

**277. AFFORD TO BUY** స్తోమత కలిగి ఉండు
A common man cannot **Afford to buy** a four wheeler.
మధ్య తరగతి వ్యక్తికి కారు కొనే స్తోమత ఉండదు.

**278. AT HOME** జ్ఞానము కలిగియుండు
I am **at home** in french.
ఫ్రెంచి భాషలో నాకు మంచి పరిజ్ఞానం ఉంది

279. **RED HANDED** నేరం చేస్తూండగా పట్టుపడ్డాడు

The culprit was coughtred **Handed.**

నేరస్థుడు, నేరం చేస్తూ పట్టుపడ్డాడు.

280. **RAINY DAY** కష్టకాలం

Save some money for the **rainy day.**

కష్ట కాలంలో ఉపయోగపడే విధంగా కొంత సొమ్మును పొదుపు చేయ్యాలి.

281. **HELL (CHAIS)** గందరగోళం

What **hell** is going on here.

ఇక్కడ గందరగోళం జరుగుతున్నది.

282. **A LION'S SHARE** సింహభాగం

My sister claims **A lion's share** in the ancestral property.

నా సోదరి తమ పూర్వికుల ఆస్తిలో తనకు సింహ (అధిక) భాగం కావాలని కోరుతున్నది.

283. **A FOOLS PARADISE** ఊహాలోకంలో విహరించ వద్దు

Don't live in **fool's paradise.**

ఊహాలోకంలో విహరించవద్దు

284. **TO EAT HUMBLE PIE** ఓటమిని అంగీకరించు

Talibans in Afghanistan **ate a humble pie** before the northern Alliance army.

నార్తరన్ అలయెన్స్ సైన్యం ముందు ఆఫ్ఘనిస్తాన్‌లో తాలిబాన్లు ఓటమిని పొందిరి.

285. **PLAY DUCKS AND DRAKES** డబ్బును విచ్చల విడిగా ఖర్చుచేయు

He is **playing ducks and drakes** with the money earned by his father.

అతను తన తండ్రి సంపాదనను విచ్చల విడిగా ఖర్చుచేస్తున్నాడు.

286. **ADD FUEL TO THE FIRE** అగ్నికి ఆజ్యంతోడైనట్లు

Please do not **add fuel to the fire** in their personal matters.

దయచేసి, వాళ్ళ అంతరంగిక విషయాల్ని మరింతగా విషమింపచెయ్యొద్దు.

287. **DAGGERS DRAWN** కత్తులు నూరు

The two brothers are always at **daggers drawn**

అన్నదమ్ములు యిరువురువొకరిపై ఒకరు కత్తులు దూసుకుంటున్నారు.

**216. SPILT OF THE TONGUE** పొరబాటున

The quarrel was due to **spit of the tongue.**

పోట్లాటంతటికీ మూలం పొరపాటున నాలిక జారటం.

**217. STANDING IN THE WAY** ఆటంకము, అవరోధము కల్గించు

Caste and religion **stand in the way** of our country's progress and development.

కులం, మతం దేశ ప్రగతికి అడ్డుగోడలు.

**218. SEND FOR** పిలువనంపు, కబురుచేయు

The doctor was **sent for** treatment to the patient.

రోగికి చికిత్స నిమిత్త డాక్టరుకు కబురు పంపారు.

**219. AT THE MOST** మహా అయితే

**At the most** he can spend hundred rupees.

మహా అయితే అతను వంద రూపాయలు ఖర్చు చెయ్యగలడు.

**220. ALMOST ALL** దాదాపుగా

We the four frinds got **Almost all** same marks.

మా నలుగురు స్నేహితులకూ దాదాపుగా సమానమైన మార్కులు వచ్చాయి.

**221. SOONER OR LATER** ఏదో ఒకరోజు (ఒకనాడు)

Every body must die **sooner or later.**

ప్రతి ఒక్కరూ ఏదో ఒకరోజు ఈలోకాన్ని వదిలి వెళ్లాల్సిందే.

**222. TAKE STOCK OF THE SITUATION** పరిస్థితిని అంచనావేయు

The Prime Minister **took stack of the situation** in Gujarath with higher authorities.

ప్రధాన మంత్రి గుజరాత్‌లో పరిస్థితిని ఉన్నతాధికారులతో సమీక్షించెను.

**223. TAKE EXCEPTION** తీవ్రంగా భావించు

He took the adverse remarks of his boss **to exception.**

అతను యజమాని చేసిన అభ్యంతరకరమైన వ్యాఖ్యలను తీవ్రంగా పరిగణించెను.

**224. TAKE TO TASK** చివాట్లు పెట్టు

The teacher took the student **to task** for the negligence.

విద్యార్థి అశ్రద్ధకు ఉపాధ్యాయుడు తీవ్రంగా మందలించెను.

**225. TURN UP** తిరిగివచ్చు

The servant boy has not **turned up** so far.

పనివాడు యింతవరకు దిరిగిరాలేదు.

226. **TURN DOWN** తిరస్కరించు

The Boss **Turned down** his request to sanction me permission.

యజమాని అతనికి అనుమతి యివ్వడానికి నిరాకరించెను.

227. **TELL UPON** వ్యతిరేక పరిణామం చూపు

Raghu is hard work **told upon** his health.

రఘు ఆరోగ్యంపైన పని తీవ్రత ప్రభావం చూపించింది.

228. **TURN A DEAF EAR** పెడచెవిని పెట్టెను

He **turned a deaf ear** to his elder's advice.

అతను పెద్దల సలహాను పెడచెవిన పెట్టెను.

229. **TAKE TO HEART** మనోవ్యధచెందు

He died **taking to heart** of his son's demice.

కొడుకు మృతివల్ల మనోవ్యధ చెంది అతను మరణించెను.

230. **TAKE PART** పాల్గొను

Children **took part** in the independence celebrations.

స్వాతంత్ర్య దినోత్సవ వేడుకల్లో పిల్లలు పాల్గొన్నారు.

231 **UNTIL AND UNLESS** తప్పనిసరిగా, అంత వరకు

My brother wants to remain unmarried **until and unless** he gets a job

తనకు ఉద్యోగం వచ్చేవరకు నా సోదరుడు వివాహం చేసుకోకూడదని నిర్ణయించుకున్నాడు.

232. **UP TO THE EARS** పూర్తిగా

The cotton growers are in heavy debts **upto the ears** and resorting to suicides.

ప్రతిరైతులు అప్పుల బాధపడలేక ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు.

233. **TURN TURTLE** తల్లక్రిందులకు

I **turn turtle** with my engagements.

నేను నా వ్యాపకాలతో తలక్రిందులవుతున్నాను.

234. **DEFEAT THE PURPOSE** ఆశయము నెరవేరకపోవు

The prohibition implementation in Andhra Pradesh **defeated the very purpose.**

ఆంధ్రప్రదేశ్‌లో ప్రవేశపెట్టిన మద్యనిషేధం యొక్క ప్రయోజనమే దెబ్బతిన్నది.

**235. DELIVER THE GOODS** ఆశయము నెరవేరు, ఉపయోగపడు

The central schemes should **deliver the goods**

కేంద్ర ప్రభుత్వ పథకాలు ఫలితాలుయివ్వాలి.

**236. TO NO PURPOSE** నిరుపయోగం

Many Governement departments serve **no purpose.**

చాలా ప్రభుత్వ శాఖలు నిరుపయోగమైనవి.

**237 TAKE INTO ACCOUNT** పరిగణలోనికి తీసుకొను

Experience will be **taken into account** at the time of appointment.

ఉద్యోగాల నియామకాలకు అనుభవానికి ప్రాధాన్యత యిస్తారు.

**238. TAKE TO HEELS** పారిపోవు

The thief **took to heels** as soon as he saw the police.

పోలీసులను చూడగానే దొంగ పారిపోయెను.

**239. SORT OUT DIFFERENCES** సమస్యను పరిష్కరించుకొను

Let's **Sort out differences** amicably.

మన మధ్యన నెలకొన్న బేదాభిప్రా యాలను సామరస్యంగా పరిష్కరిం చుకుందాం

**240. WILD GOOSE CHASE** వృధాప్రయాస

Searching for morality in the present generation is a **Wild goose chase.**

నేటితరంలో నైతిక విలువలు కనుగొనడం వృధాప్రయాస.

**241. HATS OFF** అభినందనలు

**Hats off** to Pullela Gopichand who won badminton championship.

బాడ్మింటన్‌లో ఛాంపియనిషిప్ సాధించినందుకు పుల్లెలగోపీచంద్‌కు అభినందనలు.

**242. A FEATHER IN ONE'S CAP** కలికితురాయి

Indian cricket teams success over Pakisthan will be a **feather in** Indian's team's cap.

పాకిస్తాన్‌పై భారత క్రికెట్ జట్టు సాధించే విజయం భారత్‌కు కలికితురాయి.

243. **WIN LAURELS** కీర్తి, ప్రతిష్ఠలు సంపాదించు

He brought **win laurels** to India by winning world cup.

వరల్డ్‌కప్ సాధించడం ద్వారా అతను దేశానికి కీర్తి తెచ్చాడు.

244. **VIS A VIS** పోల్చిచూచు

Don't **Vis a vis** Ram with Rahim.

రామ్‌ను రహీమ్‌తో పోల్చవద్దు.

245. **KEEP IN VIEW** దృష్టిలో ఉంచుకొను

Keep my advice **in view** before you ask.

నీవు అడిగే ముందు నాసలహాను దృష్టిలో పెట్టుకో

246. **IN VIEW OF** అందువల్ల, ఆ కారణముచేత

**In view of** incurring losses the A.P.Government wants to wind up some favctories (companies).

నష్టాల కారణంగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కొన్ని ప్రైవేటు కర్మాగారాలను మూసివేస్తున్నది.

247. **ULTRA VIRES** చట్టవిరుద్దము

To arrest any person with out suffcient evidence is **ultravires.**

తగినంత సాక్ష్యాధారాలు లేకుండా ఏ వ్యక్తినైనా అరస్టు చెయ్యడం చట్ట విరుద్దము.

248. **TURN THE CORNER** స్వస్థత చెందు, కోలుకొను

At lest Jagan has **turned the corner.**

చివరికి జగన్ జబ్బు నుంచి కోలుకున్నాడు.

249. **AT LEAST** కనీసం

**At least** you have to give respect to his age.

అతని వయస్సుకైనా నీవు కనీసం మర్యాద యివ్వాలి.

250. **AT LAST** చివరకు

**At last** the naxallites surrendered to the police.

చివరికి నక్సలైట్లు పోలీసులకు లొంగిపోయారు.

251. **A WARM WELCOME** ఘనస్వాగతం

Our students gave **a warm welcome** to the DEO.

మండల విద్యాధికారిగారికి మా విద్యార్థులు ఘన స్వాగతం యిచ్చారు.

288. **A BOLT FROM THE BLUE** గోరుచుట్టుపై రోకలి పోటు

The sudden demise of Subba rao's wife came as **a bolt from the blue.**

భార్య ఆకస్మిక దుర్మరణం సుబ్బారావుకు గోరుచుట్టుమీద రోకలిపోటుగా పరిణమించెను.

289. **AT LOGGER HEADS** శిఖపట్ల గోత్రం (విరోధం)

They were **at logger heads** since some time.

వారు కొంత కాలంగా విరోధులుగా ఉంటూ ఉన్నారు.

290. **AT SIXES AND SEVENS** చిందరవందరగా

All his belongings were **at sixes and sevens** when he was away from room.

గదిలో లేనప్పుడు అతని సామాన్లు చిందరవందరగా పడి ఉండెను.

291. **GIVE AWAY** అందచేయు

The minister **gave away** the Crit cards to the farmers.

మంత్రి రైతులకు ఋణ పత్రాలు అందచేశారు.

292. **KEEP AT ARM'S LENGTH** దూరంగా ఉంచు

He is a rogue **Keep at arm's length.**

వాడు దుష్టుడు వాడిని తగినంత దూరంలో ఉంచు.

293. **AS WELL AS** వలెనే, మాదిరిగా

Raju is reliable **As well as** Ranga.

రంగా మాదిరిగా రాజు కూడా నమ్మకస్తుడు.

294. **STRAIN EVERY NERVE** కష్టపడు, శ్రమించు

Sundar **strain every nerve** to get a job.

సుందర్ ఉద్యోగం సంపాదించటానికి ఎంతో శ్రమించాడు.

295. **RIGHT IN THE CRADLE** చిన్నతనం నుండి

His life started with adversity **Right in the cradle.**

అతని జీవితం చిన్నతనం నుంచే కష్టాలతో ప్రారంభమైంది.

296. **ABIDELY** కట్టుబడి ఉండు

We must **abidely** law.

చట్టానికి కట్టుబడి వుండాలి.

297. **CATS & DOGS - HEAVILY** తీవ్రంగా
It has been raining **Cats & dogs** for two days.
రెండు రోజుల్నించీ కుండపోతగా వర్షం కురుస్తూన్నది.

298. **SEE EYE TO EYE** ఒకరి ముఖం ఒకరు చూసుకొను
The two friends do not **See eye to eye** these days.
ఆ యిద్దరు స్నేహితులు ప్రస్తుతం ఒకరి ముఖం ఒకరు చూసుకోవడం లేదు.

299. **HANG IN THE AIR** అనిశ్చిత పరిస్థితిలో కొనసాగు
His fortune is **hanging in the air.**
అతని భవిష్యత్తు అయోమయంగా ఉంది.

300. **FROM BAD TO WORSE** క్షీణించు
His progress went **From bad to worse**
అతని అభివృద్ధి మరింత తగ్గుముఖం పట్టింది (నష్టాలలో నడుస్తున్నది).

301. **CRY OVER SPILT MILK** ఒలికిపోయిన పాలకు విచారించు
Don't **cry over spilt milk.**
నేలపాలైన పాలకు విచారించకు

302. **ADD INSULT TO INJURY** అగ్నికి ఆజ్యంపోయు
He **added insult to injury** by abusing her.
ఆమెను అవమానించటం ద్వారా అతను అగ్నికి ఆజ్యయం పోశాడు.

303. **BY DINT OF** వలన
He acheived success **by dint of** hard work.
అతను కష్టపడటం ద్వారా విజయాన్ని సాధించాడు.

304. **EXEMPLARY** ఆదర్శంగా నిలుచు
Gandhiji was an **Exemplary** to other by his simple living.
గాంధీజీ తన నిరాడంబర జీవితంతో యితరులకు ఆదర్శంగా నిలిచారు.

305. **SET OUT** బయలు దేరు
They **set out** in the morning and returned midnight.
వారు తెల్లవారకముందే వెళ్లి అర్ధరాత్రి తిరిగి వచ్చారు.

306. **SET AN EXAMPLE** ఆదర్శంగా ఉండు
A teacher must **Set an example** to the students.
ఉపాధ్యాయుడు విద్యార్థులకు ఆదర్శంగా ఉండాలి.

638. **TO RELIEVE ONE OF** పోగొట్టుకొను

I was **relievered of** my bag in Delhi while I was travelling in local train.

నేను ఢిల్లీ లోకల్ రైలు ప్రయాణం చేస్తున్నప్పుడు నా బ్యాగ్ పోగొట్టుకొన్నాను.

639. **TO PUT TO ROUT** పూర్తిగా ఓడించు

American cannot **put to rout** the Saddam Hussain inspite of severe attacks.

అతి తీవ్రమైన దాడులు జరిపినప్పటికీ అమెరికా సద్దామ్ హుస్సేన్‌ను పూర్తిగా ఓడించలేకపోయింది.

640. **TO BE NOT ALL ROSE** గులాబీలమయం కాదు

Life is **not all roses.** It has thorns also.

జీవిత మంటే, అంతా గులాబీలు కాదు ముళ్ళు కూడా ఉంటాయి.

641. **TO BUILD AN IVORY TOWER (CASTLE) IN THE ROSE GARDEN** రంగుల కలలు కను.

It is the privilege of the youth, **to build an ivory towers in the rose garden.**

గులాబీ తోటల్లో దంతాల మేడలు (గాలి మీద) యువకుల స్వాధికారము.

642. **TO STRIKE ROOTS** వ్రేళ్లూను (స్థిరంగా ఉండు)

Democracy has **struck roots** in our country despite many odds (draw backs).

ఎన్ని అవరోధాలు ఎదురవుతున్నప్పటికీ, మన దేశంలో ప్రజాస్వామ్యం స్థిరంగా ఉంది.

643. **TO RULE THE ROOST** యజమానిగా నిర్వహించు

In some houses mother **rule the roost** instead of father.

కొన్ని ఇళ్ళల్లో తండ్రికి బదులు, తల్లి పెత్తనం చెలాయిస్తూ ఉంటుంది.

644. **AT ROOST** మంచం (ప్రక్క) మీద

Lamboo is **at roost** when the sun rises.

తెల్లవారిన తర్వాత కూడా లంబూ నిద్రపోతూనే వున్నాడు.

645. **GO TO ROOST** నిద్రపోవు

The children should **go to the roost** early and rise early.

పిల్లలు పెందలాడే నిద్రపోవాలి, త్వరగా నిద్ర లేవాలి.

646. **MUCH BOAST, LITTLE ROAST** మాటలు ఎక్కువ, చేతలు తక్కువ
His deeds and actions were **much boast and little roast.**
అతని చర్యలు మాటలు ఎక్కువ, చేతలు తక్కువగా ఉన్నాయి.

647. **SAND WITCH** రెంటి మధ్య నలుగు, బాధపడు
Chalapathi is a **sand witch** between his mother and wife.
అటు భార్యకూ, యిటు తల్లికీ చెప్పలేక చలపతి మధ్యలో నలుగుతున్నాడు.

648. **A GOOD SAMARITAN** పరోపకార పరాయణుడు
The king was **good samaritan**. He helps those who are in difficulties.
రాజుగారు పరోపకార పరాయణులు ఎవరికి ఏ యిబ్బంది వచ్చినా ఆదుకుంటాడు.

649. **TO TAKE WITH A PINCH OF SALT** నమ్మకం లేకపోవు
The officer was taken his statement **with a pinch of salt.**
అతని స్టేట్‌మెంట్‌ను ఆఫీసరు నమ్మలేదు.

650. **WORTHS HIS SALT** కృతజ్ఞత వెల్లడించు
The sevant is working for the last ten years, and he is **worth his salt.**
పనివాడు గత పది సంవత్సరాలుగా యజమానికి నమ్మకంగా పనిచేస్తున్నాడు.

651. **IN THE SADDLE** అధికారంలో కొనసాగు
At seventy years Atal Behari Vajapayee was still firmly **in the saddle** as prime minister.
డెబ్బై సంవత్సరాల వయస్సులో కూడా అటల్ బిహారి వాజ్‌పేయి ప్రధాని పదవిలో స్థిరంగా కొనసాగుతున్నారు.

652. **TO GET A SACK** ఉద్యోగము నుండి తొలగించు
All that some ministers got from the cabinet of Chandra Babu Naidu **a sack** in the name of face lift.
చంద్రబాబు నాయుడు మంత్రివర్గం నుండి ఉద్వాసన పొందిన మంత్రులు అంతా అసమర్థత కారణంగానే తొలగించబడ్డారు.

653. **TO BRING TO RUIN** నాశనం చేయు
Indleness **brings to ruin.**
సోమరితనం వినాశనానికి హేతువు.

**589. COME TO PASS** సంభవించు

Many things have **came to pass** in between the two years.

ఈ రెండు సంవత్సరాల మధ్య ఎన్నో సంఘటనలు చోటు చేసుకున్నాయి.

**590. PASS AWAY** మరణించు

Krishna Kanth **passed away** suddenly.

కృష్ణకాంత్ అకస్మాత్తుగా మరణించారు.

**591. OF PARAMOUNT IMPATANCE** అధిక ప్రాధాన్యత

Now a days the AP Govt is **of paramount importance** to education.

ఇటీవల ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చదువుకు అత్యుత్తమ ప్రాధాన్యత యిస్తోంది.

**592. TO DRAW A PARALLEL** పోల్చిచూడు

It is foolish **to draw a paralled** between Gandhi and Godse.

గాడ్సేను గాంధీజీతో పోల్చడం పిచ్చితనం.

**593. TO TAKE PAINS** కష్టపడు

He **took pains** for the marriage of his sister.

చెల్లెలి పెళ్ళి కోసం అతను చాలా కష్టపడ్డాడు.

**594. OPEN HEART** నిండు హృదయం

He speaks every thing with an **open heart** (mind).

అతను ప్రతి విషయం మనస్సు విప్పి మాట్లాడతాడు.

**595. TO LOAD OUT THE OBIVE BRANCH** శాంతి సంకేతం తెలియచేయు

After a prolonged war, the Taliban heldout **the obive branch to** the Norther alliance army.

సుదీర్ఘ పోరాటం అనంతరం తాలిబాన్లు నార్తరన్ అలయెన్స్ సైన్యానికి శాంతి సందేశం పంపారు (లొంగిపోయారు)

**596. KEEP MUM** మెదలకుండా ఉండు

It is better if you **keep mum** when you don't know the answer.

నీకు సమాధానం తెలియనప్పుడు మౌనంగా వుండటం మంచిది.

**597. TO KNOW WHERE THE SHOE PINCHERS**

ఎక్కడ చెప్పు నొక్కుతున్నదో తెలుసుకోను

Richmen never **know where the shoe pinches** the poor.

పేదవారి బాధలు డబ్బుగల వారికి ఎన్నడూ తెలియవు.

**598. TO BE DRIVEN FROM PILLAR TO PAST**

ఒకచోటి నుండి యింకొక చోటికి తిరుగు

He is being **driven from pillar to past** for suitable Job.

అతను తగిన ఉద్యోగానికి ప్రతి ఒక్కరి చుట్టూ తిరుగుతూ ఉన్నాడు.

**599. TO PICK A QUARREL** తగాదాపడు, గొడవపడు

Do not **pick a quarrel** with neighbours.

ఇరుగు పొరుగుతో తగాదా పెట్టుకోకు.

**600. TO ROB PETER TO PAY PAUL** కాకుల్నికొట్టి, గద్దలకు వేసినట్లు

The government always **robs peter to pay paul.**

ప్రభుత్వం ఎప్పుడూ కాకుల్ని కొట్టి, గద్దలకు వేస్తుంటుంది.

**601. AT YOUR PEVIL (OWN RISK)** స్వంత పూచీకత్తు

I do what ever I want to do at failed my **pevil** I don't blame any body.

నేను ఏది చెయ్యదలుకుంటే అది నా స్వంత పూచీ మీద చేస్తాను. విఫలం చెందితే ఎవరినీ నిందించను.

**602. TO PAY ONE BACK IN HIS OWN COIN**

ఒకరికి అదే విధమైన సమాధానం చెప్పు

Sivaji **paid back** Aurangajeb **in his own coin.**

శివాజీ ఔరంగజేబుకు తగిన గుణ పాఠం చెప్పెను.

**603. HAVE PATIENCE WITH** ఓర్పు, సహనం ప్రదర్శించు

I **have no patience with** your behaviour.

నీ వ్యవహారాన్ని భరించే సహనం నాకు లేదు.

**604. TO SET A PRICE ON ONE'S HEAD** ఒకరిని పట్టుకోవడానికి ఆచూకీ తెలిపిన వారికి యిచ్చే బహుమానం.

The T.N. State Govt. **set a price** or fifty lakhs on the **head** of sandal smuggler Veerappan.

చందనాన్ని దొంగ రవాణా చేసే వీరప్పన్ తలకు తమిళనాడు ప్రభుత్వం 50 లక్షల రూపాయల వెల కట్టింది.

605. **THE POT CALLS THE KETTLE BLACK**
గురివింద తన నలుపు ఎరగనట్లు
His attitude is like **pot call the kettle black**
అతని ప్రవర్తన కుండ, కిటిల్ (టీకాచే పాత్ర) ను నల్లగా ఉన్నావని అనటంలా వుంది.

606. **TO TAKE THE PLUNGEE** చొరవచూపించు (ధైర్యము చేయు)
What ever work Saran want to do, he **takes the plunge** in order to get success.
శరణ్ ఏ పని చెయ్యాలన్నా ధైర్యం చేసి, విజయం సాధించడం కోసం చొరవ చూపుతాడు.

607. **TO PLUME ONE SELF ON** గొప్పలు, బడాయిలు పలుకు
Do not **plume yourself on** your beauty.
నీ అందానికి మురిసిపోయి గొప్పలు చెప్పుకోకు.

608. **TO PLAY ONE'S CARDS WELL** అవకాశాల్ని వినియోగించుకొను
Wise people **play their cards well.**
తెలివి గలవాళ్ళు అవకాశాన్ని తెలివిగా ఉపయోగించుకుంటారు.

609. **FROM ALL QUARTERS** అన్ని వైపుల నుండి
Relatives came to our house **from all quarters** on the occasion of Sailesh's birthday.
శైలేష్ పుట్టిన రోజు సందర్భంగా అన్నివైపుల నుండి బంధువులు వచ్చారు.

610. **NEGLIGIBLE QUANTITY - A PERSON WHO NEED NOT BE RECK ONED WITH** లెక్కలోకి రాని (అప్రధానమైన)
Retired people are treated as **negligible quality.**
ఉద్యోగ విరమణ చేసిన వారు ప్రాధాన్యత లేని వారుగా పరిగణింపబడతారు.

611. **IN A QUANDARY** అయోమయ (తోచని) పరిస్థితి
When he missed the train, he was **in a Quandary.**
రైలు తప్పిపోతే, ఏం చెయ్యాలో తోచని పరిస్థితిని అతను ఎదుర్కోవలసి వచ్చింది.

612. **IN THE QUAG MIRE** ఇబ్బందులు ఎదుర్కొను
Middle class families are **in the quag mire** these days of rising prices in racket speed.
మధ్య తరగతి ప్రజలు ఆకాశానికి అంటుతున్న ధరలకు తట్టుకోలేక ఎన్నో యిబ్బందులు పడుతున్నారు.

**613. TO FEEL ONE'S PULSE** నాడి (అభిప్రాయం) తెలుసుకొను

A leader should be able **to feel the pulse** of fellow workers.

నాయకుడు అన్న వాడికి తోటి పనివాళ్ళ అభిప్రాయాలు తెలిసి ఉండాలి.

**614. TO PULL UP** మందలించు

The Teacher **pulled up** the student for his mis behaviour.

అతని చెడు నడత కారణంగా ఉపాధ్యాయుడు ఆ విద్యార్థిని మందలించారు.

**615. TO PULL THROUGH OR TO GET THROUGH**

కృతార్థుడగు / ఉత్తీర్ణత సాధించు

His son **pulled through** the examination some how or the other.

అతని కొడుకు ఏదో విధంగా పరీక్షలో బయట పడగలిగాడు.

**616. REAPING HOOK** అదృష్టము

Every body falls a prey to the **reaping hook.**

'అదృష్టము' అనే గాలానికి అందరూ బలిఅవుతారు (చిక్కుకుంటారు).

**617. REAP THE FRUITS OF** ఫలితము అనుభవించు

Every on must **reap the fruits (Comequees) of** one's actions according to 'Gita'.

'భగవద్గీత' ననుసరించి ప్రతి ఒక్కరు తమ 'కర్మ' లను ఫలితం అనుభవించాల్సి ఉంటుంది.

**618. RANSOM** ఒక వ్యక్తి నుంచి సమాచారం రాబట్టుటకు బంధించు

The taliban regine in Afghanistan held a British Journalist to **ransom.**

ఆఫ్ఘనిస్తాన్‌లో తాలిబాన్ ప్రభుత్వం బ్రిటన్‌కు చెందిన పత్రికా విలేఖరిని సమాచారం రాబట్టుటకై నిర్బంధించిరి.

**619. RADICAL (THOUGH) CHANGE** సమూలమైన మార్పు

Computer brought a **radical change** in our lives.

మన జీవితాల్లో కంప్యూటర్‌లు సమూలమైన మార్పు తెచ్చాయి.

**620. RADICAL ERROR** ప్రధానమైన (ముఖ్యమైన) తప్పు

Ego is a **radical error.**

అహంకారం ప్రధాన శత్రువు.

654. **TO RUB SHOULDERS WITH** సంబంధము కలిగియుండు

Light **rubs shoulders with** darkness

వెలుగు వెంటే చీకటి వుంటుంది.

655. **SWEET SEVENTEEN** యుక్త వయస్కురాలైన

Sadaf is now **sweet seventeen.**

సదాఫ్ యిప్పుడు 17 సంవత్సరాల అందగత్తె.

656. **TO SET APART** ప్రత్యేకించు

I have **set apart this** room for guests and friends.

నేను ఈ గదిని అతిథులకు, స్నేహితులకు ప్రత్యేకించాను.

657. **SET AGAINST** బ్యాలెన్స్ (మిగిలి ఉన్న) ఒక దానికొకటి పోటీ

If you **set your joys against** your sorrows you will find that your band balance in nill.

నీ ఆనందాన్ని (సుఖాన్ని) నీ దుఖానికి బదులుగా పెడితే, అప్పుడు నీ బ్యాంక్ (జీవితం) బ్యాలెన్స్ (మిగులు) ఏమీ ఉండదు (నిల్)

658. **ALL SERENE** అంతా మంచి

**All serene** in your lie here after.

నీ జీవితంలో యిక్కడ్నించి అంతా మంచే !

659. **TO SEE THE LIGHT** ప్రచురణకు నోచుకొను (వెలుగుచూడు)

My writings have at last **seen the light** (published)

చివరికి నా రచనలు వెలుగుచూసినాయి (అచ్చు అయినాయి).

660. **TO PLAY THE SECOND FIDDLE TO** వంతపాడు

Friends **play a second fiddle to** him.

స్నేహితులు అతనికి వంతపాడతారు.

661. **GENTLEMAN OF THE OLD SCHOOL** సంకుచిత భావాలు గల

Thakaray is **gentleman of the old school**.

థాకరే పాత కాలపు పెద్దమనిషి.

662. **SCHOOL OF ADVERSITY** పేదరికంలో

Many great people were educated in the **school of adversity.**

గొప్పవాళ్లందరూ కష్టాల ఒడిలో (బడి) నుంచి పైకి వచ్చిన వాళ్లే.

663. **TO SAY ONE NAY** ఏదైనా నిరాకరించు
I cannot **say him nay** (no).
ఏది అడిగినా నేను కాదనలేను.

664. **TO SAY A GOOD WORD FOR** మంచి మాట
**Say a good word for** me to him.
నా గురించి అతనికి ఒక మంచి మాట చెప్పు.

665. **THE LONG AND THE SHORT** సంక్షిప్తంగా, సంగ్రహంగా
To say **the long and short** of the incident is he had stolen money.
ఆ సంఘటన సంగ్రహంగా ఏమిటంటే అతను డబ్బు దొంగిలించాడు.

666. **TO MAKE SHIP WREEK** నాశనమై పోవు, చెడిపోవు
Shyamala **made a ship wreek** of my hopes.
శ్యామల నా ఆశల్ని నాశనం చేసింది.

667. **TO STEP INTO SOME ONE'S SHOES** అవతలివాని బాధ్యతలు చేపట్టు
That TDP in the state has **stepped into the shoes** of the congress.
రాష్ట్రంలో తెలుగుదేశం పార్టీ, కాంగ్రెస్ పార్టీ బాధ్యతలు చేపట్టింది.

668. **THE SHIFTS AND CHANGES OF** ఒడిదుడుకులు, కష్టసుఖాలు
We have to face bravely in **the shifts and changes of** life.
మనం జీవితంలో ఒడిదుడుకులను ధైర్యంగా ఎదుర్కోవాలి.

669. **ON THE SHELF** అమలుకు నోచుకోని
His file (proposal) is still **on the shelf.**
అతని ఫైలు యింకా అమలుకు నోచుకోలేదు.

670. **SHEEP THAT HAVE NO SHEPPERD** మంచి కాపరి లేని గొర్రెలు
Indians are like **sheep that have no a good shepperd**.
భారతీయులు మంచి కాపరి లేని గొర్రెల్లా ఉన్నారు.

671. **TO FOLLOW LIKE SHEEP** గొర్రెల మాదిరిగా అనుసరించు
Public (people) **follow the politicians like sheep**.
ప్రజలు రాజకీయ వేత్తలను గొర్రెల మందలా అనుసరిస్తారు.

672. **TO PLAY A SHABBY TRICK** హీనంగా ప్రవర్తించు
It does not **pay to play a shabby trick.**
హీనంగా ప్రవర్తించినందువల్ల ఉపయోగంలేదు.

673. **TO SHARK FOR A LIVING** మోసముతో జీవించు
It does not pay **to play a sharks for a living.**
చాలామంది వ్యాపారులు మోసంతో జీవిస్తూ ఉంటారు.

674. **THE SHACKLES OF CONVENTION**
ఆచారాల (సంప్రదాయాల) సంకెళ్లు
Youth is chained in the **shackles of conventions.**
యువత ఆచారాలు అనే సంకెళ్లతో బంధించబడింది.

675. **TO SPIN A YARN** కట్టు కధలల్ల
Raji is an expert in **Spinning Yarn.**
కట్టు కధలు అల్లటంలో రాజు గట్టివాడు.

676. **IN THE SOUP** చిక్కుల్లో యిరుక్కొను
Narendra Modi is now **in the soup** of Gujarath's Communal aggravations
గుజరాత్ మత ఉద్రిక్తతల కారణంగా నరేంద్రమోడీ యిప్పుడు చిక్కుల్లో వున్నారు.

677. **THE SKY IS THE LIMIT** హద్దు లేదు
There is no limit to the ambitions of man. **The sky is the only limit** for him.
మనిషి ఆశకు హద్దు అంటూ లేదు, ఆకాశమే హద్దు.

678. **TO SAVE ONE'S SKIN** ఆరోపణలనుండి బయట పడు
Exprime minister P.V. Narasimha Rao **saved his skin** from all elegations put upon him.
తన మీద మోపబడిన ఆరోపణలనన్నిటి నుండి మాజీ ప్రధానమంత్రి పి.వి. నరసింహారావు బయటపడ్డారు.

679. **TO SKIM THE CREAM OFF** సారమును గ్రహించు
Nehru **skimmed the cream off** all honours.
నెహ్రూ గారు అన్ని గౌరవాలను (భారతరత్నతో సహా) పొందారు.

680. **TO HAVE A SKELETON IN ONE'S CUP BOARD** ప్రతిష్ట దిగజార్చు
Every politician **has a skeleton in the cup board.**
ప్రతి రాజకీయ నాయకుడి ప్రతిష్టను దిగజార్చే అవినీతి ఆరోపణలు ఉంటాయి.

681. **SKELETON AT A FEAST** ఆనందాన్ని పాడుచేయు
An ugly quarrel is a **skeleton at a feast.**
అనవసరమైన (అసహ్యకరమైన) తగాదా భోజనానికి ఆటంకంగా పరిణమిస్తుంది.

**682. TO COME TO TERMS** రాజీకి వచ్చు, అంగీకారమునకు వచ్చు

India and Pakistan failed **to come to terms** at Agra summit on Kashmir issue.

భారత-పాకిస్థాన్ దేశాలు రెండూ, ఆగ్రా సమావేశంలో కాశ్మీరు సమస్యపై ఒక అంగీకారానికి రాలేక పోయినవి.

**683. TO TENDER RESIGNATION** రాజీనామా చేయు

There who did not get berths in the reorganised cabinet of Chandra babu Naidu are gettin ready **to tender their resignation** to express their resentment.

చంద్రబాబునాయుడి మంత్రి మండలిలో పదవులు దొరకని వారు రాజీనామా చేసేందుకు సిద్ధపడుతున్నారు.

**684. TO TELL A LIE** అబద్ధమాడు

Don't **tell me a lie**

నాకు అబద్ధం చెప్పకు.

**685. TO TELL UPON** చెడ్డ ఫలితము నిచ్చు, నష్టము కలిగించు

Hard work **told upon** his healthy severely.

అధిక పరిశ్రమ అతని ఆరోగ్యాన్ని తీవ్రంగా దెబ్బతీసింది.

**686. TEDDY BEAR** పిల్లలు ఆట వస్తువు (ఎలుగుబంటి)

Many your people treat life as **teddy bear** not real bear, that is the real problem with them.

చాలా మంది యువకులు జీవితాన్ని ఆట ఎలుగుబంటిగా భావిస్తారే కాని, నిజమైన ఎలుగుబంటిలా భావించక పోవటం పెద్ద లోపం.

**687. TEAM WORK** ఉమ్మడి కృషి

Success is the result of **tearm work.**

సమిష్టి కృషి, ఫలితమే విజయం.

**688. TO TAKE INTO ONE'S CONFIDENCE** విశ్వాసంలోకి తీసుకొను

Chandra Babu Naidu never **took the** opposition **into confidence.**

చంద్రబాబునాయుడు ప్రతి పక్షాలను ఎన్నడూ విశ్వాసంలోకి తీసుకోలేదు.

**689. THREAD BARE** పూర్తిగా చినిగి పోయిన, నగ్నముగా

The begger is with **thread bare.**

ఆ బిచ్చగాడు పూర్తిగా చినిగిన బట్టలతో నగ్నంగా వున్నాడు.

690. **ONE IN A THOUSAND** అరుదు, వెయ్యికొకడు
Good people are **one in a thousand.**
మంచివాళ్లు నూటికో, కోటికో ఒకళ్ళుంటారు.

691. **THOUSAND AND ONE** లెక్కలేనన్ని
Children generally choose **thousand and one** excuses to hide their mistaken.
పిల్లలు తమతప్పుల్ని కప్పి పెట్టటానికి సహజంగా లెక్కలేనన్ని కారణాలు ఎంచుకుంటారు.

692. **A THORN IN ONE'S FLESH** తినే ఆహారంలో ముల్లు గ్రుచ్చుకొను
Kashmir is **thorn in flesh** for India.
కాశ్మీరు భారత దేశానికి భోజనంలో ముల్లులా గుచ్చుకునేదిగా ఉంటుంది.

693. **THICK SKINNED** స్పందించకపోవు
Some wealth power makes a man **thick skinned.**
కొంతమంది ఐశ్వర్యం, అధికారంతో మదించినవాళ్లు రాతి గుండె కలిగి వుంటారు.

694. **THEN AND THERE** అక్కడికక్కడే **(ON THE SPOT)**
**Then and there** I paid the fees.
అక్కడికక్కడే నేను ఫీజు కట్టేశాను.

695. **TESTING TIME** పరీక్షా సమయం
India is pasing through a **testing time.**
భారత దేశంకు యిది గట్టి పరీక్షా సమయం.

696. **NEAT AND TIDY** పరిశుభ్రంగా
The children should be seen **neat and tidy.**
పిల్లలు పరిశుభ్రంగా ఉండేలా చూడాలి.

697. **TO TREAD ON ONES** ఒకరిని అగౌరవపరచు, బాధకలిగించు
Do not **tread on** the toes of your fellows
నీ తోటివారిని అగౌరవపరచకు, కష్టపెట్టకు.

698. **TO TAKE AT THE TIDE** అవకాశములు
Take this event **at the tide.**
అవకాశాన్ని విడవకుండా ఉపయోగం చేసుకోవాలి.

**699. TIME AND TIDE** అవకాశములు

**Time and tide** waits for no man

అవకాశాలు ఎవరి కోసమూ ఎదురు చూడవు.

**700. TO GO WITH THE TIDE** నలుగురితో కలిసిపోవు

I must **go with the tide** or I will be left behind.

నేను నలుగురితోపాటు కలిసి ముందుకు సాగాలి లేకపోతే, నేను వెనకబడిపోతాను.

**701. UNDER THE THUMB OF** ఒకరికి లోబడి (భయపడి)

The students are no longer **under the thumb of** their teacher now a days.

విద్యార్థులు ఈ రోజుల్లో ఉపాధ్యాయిల చెప్పుచేతల్లో లేరు.

**702. TO THROW OUT (MAKE OUT)** బయటికి నెట్టి (గెంటి) వేయు

The poor old man was **thrown out of** his house by his own sonsun ceremoniously.

నిర్దయగా ఆ ముసలాయన్ని, స్వంత కొడుకులే యింటి నుండి బయిటకు వెళ్ళగొట్టారు.

**703. THROUGH AND THROUGH** పూర్తిగా

He is a scoundrel **through and through.**

అతను నిలువెల్లా దుర్మార్గుడు.

**704. AN UGLY JOB - TO DANCE TO THE TUNES OF**

ఒకరి కాలి క్రింద చెప్పులా వ్యవహరించు

Dancing according to the tuner of other is **an ugly Job.**

ఒకరి చెప్పినట్టల్లా ఆడటం చాలా అసహ్యాకరమైన పని.

**705. TO BECOME THE TOOL OF** ఒకరి అడుగులకు మడుగులొత్తు (తొత్తుగా వ్యవహరించు)

He has **become the tool of** his boss to get his leave sanctioned.

అతను తన యజమాని నుంచి శెలవు మంజూరు కోసం అతని అడుగులకు మడుగులొత్తుతున్నాడు.

**706. TO HOLD ONE'S TONGUE** నోరు మూసుకుని కూర్చొను (మెదలకుండా)

It is better **to hold your tongue** as you have nothing important to say.

నీవు చెప్పవలసిన ముఖ్యమైన విషయం ఏమీ లేనప్పుడు మౌనంగా ఉంటే మంచిది.

707. **TO AND FRO** ఇటు-అటు, రాను-పోను

What are the **to and fro** flight charges (fare) to Hyderabad.

హైదరాబాద్‌కు రానుపోను విమానం ఛార్జీలు ఎంత?

708. **NOT TOMORROW ONLY TODAY** రేపు కాదు (రాదు) నేడే

Do not hope to have your was her fulfilled **tomorrow** remember, tomorrow never comes but only today.

నీ కోరికలు రేపు తీరతాయనుకోకు, రేపు ఎప్పుడూ రాదు, ఉన్నదల్లా నేడే (ఈ రోజే)

709. **TO TOE THE LINE** అడుగు జాడల్లో నడుచు, అనుసరించు

The teachers **toe the line** of the school Inspector.

ఉపాధ్యాయులు పాఠశాలల తనిఖీ అధికారి చెప్పినట్లు నడుచుకుంటారు.

710. **TO HAVE AT ONE'S FINGER TIPS** బాగా జ్ఞాపకం ఉంచుకొను

A good student has his lesson **at his finger tips.**

మంచి విద్యార్థి పాఠం చక్కగా చదివి జ్ఞాపకం ఉంచుకుంటాడు.

711. **TO BE IN A TIGHT CORNER** క్లిష్ట పరిస్థితి నెదుర్కొను

I am **in a tight corner** with him.

అతనితో నాకు యిబ్బందులు వున్నాయి.

712. **A WALKING ENCYCLOPAEDIA** నడిచే విజ్ఞాన సర్వస్వం

Our lecturer is a famous as **a walking encyclopaedia.**

మా లెక్చరర్ నడిచే విజ్ఞాన సర్వస్వంగా పేరు గాంచిరి.

713. **UTMOST RELUCTANCE** మిక్కిలి అయిష్టత

He showed his **utmost reluctance** to follow me.

అతను నన్ను అనుసరించడానికి పూర్తి అయిష్టత ప్రదర్శించాడు.

714. **UPS AND DOWNS** ఒడిదుడుకులు

I have seen many **ups and downs** in his life.

నేను అతని జీవితంలో ఎన్నో ఒడిదుడుకులు చూశాను.

715. **UNLESS AND UNTIL** వరకు (షరతు)

Don't leave this place **unless and until** he comes.

అతను వచ్చే వరకు యిక్కడి నుంచి కదలవద్దు.

716. **UNIVERSAL APPLAUSE** ప్రశంస, పొగడ్త
Vajapayees speech draw **universal applause** in SAARC
ప్రధాని వాజ్‌పేయ్ సార్క్ సదస్సులో ఉపన్యాసానికి మంచి స్పందన కన్పించింది.

717. **TO COME TO AN UNDERSTANDING** రాజీ (అంగీకారానికి) వచ్చు
Let us come **to an understainging** on this issue.
ఈ విషయాల పైన మనం ఒక అంగీకారానికి వద్దాం.

718. **UNDER A CLOUD** సందేహాస్పదము
The conduct of some ministers is **under cloud** as alleged by the opposition.
కొందరు మంత్రులకు నేర చరిత్ర ఉన్నదని ప్రతిపక్షం విమర్శిస్తున్నది.

719. **ULTIMATE CAUSE OF LIFE** జీవిత రహస్యం
Man has not yet discovered the **ultimate cause of life** (soul)
మనిషి ఇంతవరకు జీవిత పరమార్ధం ఏమిటి అన్న విషయం తెలుసుకోలేకపోయాడు.

720. **ON THE VERGE OF** అంచుమీద
Hand loom weavers in andhra pradesh are **on the verge of** starvation.
ఆంధ్రప్రదేశ్‌లో చేనేత కార్మికులు ఉపాధిలేక ఆకలి చావులకు లోనవుతున్నారు.

721. **TO TAKE VENGENCE** కక్ష (పగ) సాధించు
He **took vengence** against the clever boy.
అతను ఆ తెలివి గల కుర్రవాని మీద పగబూనాడు.

722. **TO GIVE VENT TO** వెలిబుచ్చు, స్పష్టముగా తెలియచేయు
The sorrowful wife **gave vent to** her suppressed emotions.
దీనురాలైన భార్య తన హృదయంలో అణచబడిన భావోద్రేకాలకు వెలిగ్రక్కింది.

723. **INVAIN** నిరూపయోగము, నిరర్ధకము
All the efforts to save him proved **invain.**
అతన్ని బ్రతికించడానికి చేసిన ప్రయత్నాలన్నీ వ్యర్థమైనాయి.

724. **VAGRANT SPECULATION** విచ్చలవిడి ఆలోచనలు
Those who have no aim or goul in life indulge in **vagrant speculations.**
సరియైన లక్ష్యం లేనివారు విచ్చలవిడి ఆలోచనలతో జీవితాన్ని వ్యర్థం చేసుకుంటారు.

725. **VACANT FRIVOLITIONS** వ్యర్ధమైన, విలువలేని పోకడలు
Many youngmen today are given up to **vecant frivolities.**
చాలామంది యువకులు వ్యర్ధమైన విలువలేని వెర్రి పోకడలు పోతున్నారు.

726. **UTTER ABSURDITY** పూర్తి మూర్ఖత్వము
It is the **utter absurdity** to believe every one is a fool.
ప్రతి ఒక్కరూ మూర్ఖులని నమ్మడం పరమ మూర్ఖత్వం.

727. **UTTER MISERY** కటిక దారిద్ర్యంలో మ్రగ్గు
Ninety perent (Majority) of India's masses live in **utter misery** (felow poverty line)
భారత దేశంలో నూటికి తొంభై శాతం ప్రజలు పేదరికంలో మ్రగ్గుతున్నారు.

728. **BY VIRTUE OF** కారణము చేత
The criminal was set free **by virtue of** his good conduct.
నేరస్తుణ్ణి, అతని సత్ ప్రవర్తన కారణంగా విడుదల చేశారు.

729. **TO KEEP VIGIL** రాత్రంతా నిద్రలేకుండా గడుపు
The mother **kept vigil** at her ailing daughter.
జబ్బుతో బాధపడుతున్న కూతురు దగ్గర తల్లి రాత్రంతా నిద్ర లేకుండా గడిపింది.

730. **POINT OF VIEW** అభిప్రాయము
I cann't agree with your **point of view.**
నీ ఉద్దేశం (అభిప్రాయము) తో నేను ఏకీభవించను.

731. **IN VIEW OF** కారణం వలన
He was allowed to go home **in view of** his ill health.
అతని అనారోగ్యంతో బాధపడుతూ ఉన్నందున యింటికి వెళ్ళడానికి అతనికి అనుమతి లభించింది.

732. **TO VIE WITH** పోటీపడు
The traders **vie with** to increase the prices.
వర్తకులు పోటీ పడి ధరలు పెంచుతుంటారు.

733. **TO GAIN VICTORY OVER** విజయం సాధించు, గెలుపొందు
We have **to gain a victory mainly over** our parios and emotions.
మన కోరికలు, ఆశయాలను మన అదుపులో ఉంచుకొని విజయాలు సాధించాలి.

734. **TO MOVE IN A VICIOUS CIRCLE** ఒక నిర్ణయానికి రాలేక పాతవాదననే కొనసాగించు
Political contravers is **move in a vicious circle.**
రాజకీయ కక్షలు, తగాదాలు ఒక నిర్ణయానికి రాలేక విషవలయంలో చిక్కుకుంటున్నాయి.

735. **VIA MEDIA** మధ్యస్తమార్గం
I find the **via media** for compromising our differences.
నేను మన అభిప్రాయాలలో రాజీ పడేందుకు మధ్యేమార్గం కనుగొన్నాను.

736. **VESTED WITH** కలిగియుండు
The Principal was all in all and **vested with** full authority.
ప్రిన్సిపాల్ అన్ని అధికారాలు కలిగి అన్నీ తానేగా వ్యవహరిస్తున్నాడు.

737. **TO GIVE WARM RECEPTION (WELCOME)** ఘన స్వాగతం
American president Bill Clinton was **given a warm reception** during his visit in New Delhi.
అమెరికా అధ్యక్షుడు బిల్ క్లింటన్‌కు న్యూఢిల్లీలో ఘనస్వాగతం లభించంది.

738. **TO BE ON THE WAR PATH** దాడిచేయుటకు సిద్ధపడు
Pakistan is **on the war path** against India over Kashmir issue.
కాశ్మీర్ వివాదం పైన పాకిస్థాన్ భారత దేశంతో యుద్ధానికి సిద్ధపడుతున్నది.

739. **TO WAGE A WAR** దాడి
Hitler **wiged a war** against France.
హిట్లర్, ఫ్రాన్సు పైన దాడిచేశాడు.

740. **COLD WAR** ప్రచ్ఛన్న యుద్ధం
There is **cold war** between India and Pakistan.
భారత్, పాక్ దేశాల మధ్య ప్రచ్ఛన్న యుద్ధం జరుగుతోంది.

741. **IN THE WAKE OF** వెనుక
Sufferings come **in the wake of** sins.
బాధలు, కష్టాలు పాపం కారణంగా వస్తుంటాయి.

742. **LUMINOUS - VOLUMINOUS** ప్రకాశవంతం – పెద్ద పరిమాణం
Your report should be **luminous but not voluminous.**
నీ నివేదిక ఉపయోగకంగా ఉండాలి. పేజీల సంఖ్య ముఖ్యం కాదు.

743. **VOLTE FACE** ముఖంచాటుచేయు
His resignation as an M.L.A. was an act of **volte face.**
అతను తన M.L.A. పదవికి రాజీనామా చెయ్యటం ఒక ఎత్తుగడ.

744. **WITH ONE VOICE** ఏకగ్రీవంగా, ఐక్య కంఠంతో
The opposition turned down the proposal **with one voice.**
ప్రతిపక్షం ఏకగ్రీవంగా తీర్మానాన్ని వ్యతిరేకించింది.

745. **TO GIVE VOICE TO** తెలియజేయు
He **gave voice to** his resent ment.
అతను తన వ్యతిరేక భావాన్ని బహిరంగంగా వ్యక్తపరిచాడు.

746. **TO PAY A VISIT** దర్శించు
I **paid her a visit** yesterday on the eve of her birthday.
నేను ఆమె పుట్టిన రోజు సందర్భంగా నిన్న కలసి అభినందించాను.

747. **VIS-A-VIS** వ్యతిరేకంగా
Let's comider the prosperity of India **vis-a-vis** unemployment.
నిరుద్యోగులకు వ్యతిరేకంగా మన భారత దేశ సౌభాగ్యాన్ని కోరుకుందాం.

748. **A WOLF IN SHEEP'S CLOTHING** గొర్రెతోలు కప్పుకున్న తోడేలు
He is **a wolf in sheeps clothing.**
అతను గొర్రె తోలు కప్పుకున్న తోడేలు లాంటివాడు.

749. **A NINE DAYS WONDER** కొద్ది రోజుల ఆనందం
Any thing is **a nine days wonder** including marriage.
ఏదైనా పెళ్లితో సహా తొమ్మిది రోజుల వింత.

750. **WIPE OUT** నిర్మూలించు, తుడిచిపెట్టు
Let us **wipe out** bad eliments from us.
మనలో వున్న చెడు లక్షణాలను మనం తుడిచి పెట్టేద్దాం.

751. **WILD GOOSE CHASE** వ్యర్థప్రయత్నము, కుందేటి కొమ్ము
For giving liquor is a **wild goose, chase** for the druncard.
మద్యం మానెయ్యడం ఆ తాగుబోతుకు వ్యర్థప్రయత్నం

752. **TO WEIGH THE PROS AND CONS** అన్ని వైపులా ఆలోచించు
He resigned his job without **weighing the pros and cons** with his short tempor.
అతను తాత్కాలిక ఆవేశంతో ఉద్యోగానికి రాజీనామా చేశాడు.

753. **WEAR OUT** పాతబడిపోవు (ఉపయోగపడక పోవు)
The present system of Education has **worn out.**
ప్రస్తుత విద్యావిధానం పాతబడిపోయింది.

754. **TO PAVE THE WAY FOR** మార్గము సుగమం చేయు
The slogan Quit India **paved the way for** India's Independence.
క్విట్ ఇండియా నినాదం స్వాతంత్ర్య సాధనకు దారి సుగమం చేసింది.

755. **TO GO THE WAY OF THE WORLD** మరణించు, చనిపోవు
Every body must **go the way of the world** one day or other.
ప్రతి ఒక్కరూ ఏదో ఒక రోజు మరణించ వలసినదే.

756. **TO WASH ONE'S HANDS OF** ఆరోపణలనుండి బయటపడు
The minister **washed his hands** of alligations.
ఆ మంత్రి ఆరోపణలనుండి బయటపడ్డాడు.

757. **YELLOW JOURNALISM** సంచలనాత్మక వార్తా పత్రిక
Pingali Dasaradha Ram died due to**Yellow Journalism.**
సంచలన వార్తల కారణంగా పింగళి దశరథరాం మరణించాడు.

758. **YEARN FOR, AFTER** తీవ్రంగా వాంఛించు
The child **yearns for** the new model toy.
పిల్లవాడు కొత్త బొమ్మను ఎక్కువగా కోరుతున్నాడు.

759. **TO SPIN YARN** కథలు అల్లు (చెప్పు)
Madhuranthakam Rajaram could always **spin a rice yarn.**
మధురాంతకం రాజారాం ఎప్పుడూ మంచి మంచి కథలు అల్లేవాడు.

760. **YARD STICK** కొలబద్ద (ప్రయాణము)
Theory should be measured by the **yard stick** of practice.
సిద్ధాంతాన్ని ఎప్పుడూ ఆచరణతో కొలవాలి.

761. **GO FOR WOOL AND COME HOME SHORN**
వ్యవహారము వ్యతిరేకంగా
Chandrababu Naidu went to NRIs for investments in state **for wool and came home shorn.**
చంద్రబాబునాయుడు రాష్ట్రంలో పెట్టుబడులకై ఎన్నారైల దగ్గరికి ఆర్భాటంగా వెళ్ళి నిరాశతో తిరిగి వచ్చారు.

762. **MUCH CRY AND LITTLE WOOL** నిరాశాజనకమైన పరిణామం
Ambition evsually means **much cry and little wool.**
విపరీతమైన ఆశ (ఆకాంక్ష) నిరాశాజనకమైన పరిణామం.

763. **TIED TO A WOMAN'S APSON STRINGS**చీర కొంగుమడి
Some husbands are **tied to the apson strings** of their wifes.
కొంత మంది భర్తలు, భార్యల కొంగుపట్టుకొని క్షణం విడిచి పెట్టి ఉండరు.

764. **WONDER LAND** అందమైన ఊహాలోకం
Disney alnd is a **wonder land** of human creation.
డిస్నీలాండ్ మానవుడు సృష్టించిన ఊహాలోకం.

765. **SUCCUMB TO** చనిపోవు
He **succumbed to** diabetis.
అతను మధుమేహ వ్యాధితో మరణించాడు.

766. **SUSTAIN INJURIES** దెబ్బలు తగులు, గాయపడు
Jakie **sustained serious injuries** in an accident.
జాకీ ప్రమాదంలో తీవ్రంగా గాయపడ్డాడు.

767. **MELTING POT** అగ్ని గుండం
Kashmir is in a **melting pot** due to terrorist activities.
కాశ్మీర్ ఉగ్రవాదుల చర్యల కారణంగా ప్రమాదస్థితిలో ఉంది.

768. **WALK ON RAJOR EDGE** ప్రమాదపు అంచున పయనించు
He saved the child by **walking on the rajor edge.**
అతను ప్రమాదకరమైన అంచుపైన నడుస్తున్న పిల్లవాడిని రక్షించాడు.

769. **ACQUIT OF** విడుదల పొందు
Dilip was **acquitled of** the charge from murder M.L.A.
M.L.A. హత్యా నేరం నుండి దిలీప్ నిర్దోషిగా విడుదలపొందాడు.

770. **ACCUSE OF** నేరము మోపు
The police **accused** him of murder.
పోలీసులు అతన్ని హత్యకు నేరస్థుడిగా నిర్ణయించారు.

771. **ACE OF** చిటికలో క్షణంలో
He was saved with in **ace of** being run over by a lorry.
అతను లారీ కింద పడకుండా తృటిలో ప్రమాదం తప్పింది.

772. **COME ACROSS** ఎదుర్కొను
The teacher never **come across** such questions.
ఉపాధ్యాయుడు అటువంటి ప్రశ్నను ఎన్నడూ ఎదుర్కోలేదు.

773. **ACQUANT WITH** పరిచయము కలిగియుండు
I am **accquainted with** a collector.
నాకు కలెక్టర్‌తో కొద్దిగా పరిచయం ఉంది

774. **ACCOMPANY BY** అనుసరించు, కూడా ఉండు
The Chief Minister was **accompained by** state Home Minister during his visit to Krishna district.
ముఖ్యమంత్రి కృష్ణాజిల్లా పర్యటనలో రాష్ట్ర గృహమంత్రి ఆయన్ని అనుసరించాడు.

775. **OFFER AN AFFRONT** ధిక్కరించు, నిర్లక్ష్యము చేయు
The student **offered an affront** to the teacher.
విద్యార్థి ఉపాధ్యాయుడు పట్ల అగౌరవంగా ప్రవర్తించాడు.

776. **PUT FALSE APPEARANCE** దొంగ వేషము వేయు
Beware of rogues who **put false appearance** like gentle men and swindle other.
మంచిగా నటిస్తూ పెద్ద మనుషులుగా చలామణి అవుతున్న పెద్ద మనుష్యుల పట్ల అప్రమత్తంగా ఉండాలి.

777. **LIABEL TO BE PUNISHED** శిక్షకు పాత్రులుగా
Those who violate the law (rules) are **liable for punishment.**
చట్టాల్ని అతిక్రమించిన వారు శిక్షార్హులు.

778. **PRUDENT** శిక్షకు పాత్రులుగా, ముందు జ్యాగ్రత్త
You should be **prudent** of bad habits.
చెడు అలవాట్లు పట్ల నీవు ముందు జాగ్రత్తతో వుండాలి.

779. **DESTINED TO** లోబడు (విధికి)
Every man is **destined to** death.
ప్రతి మనిషీ మరణానికి లోబడిన వాడే !

780. **TAKE UNDUE ADVANTAGE** అనుచిత లాభం పొందు
The police **take the undue advantage** of their power.
పోలీసులు తమ అధికారాన్నించి దుర్వినియోగ లాభం పొందుతూ వుంటారు.

**781. ADHERE TO** కట్టుబడి వుండు, అంటి పెట్టికొని ఉండు.
Always try to **adhere to** your word.
ఇచ్చిన మాటకు కట్టుబడి వుండేలా ఎప్పుడు ప్రయత్నించు.

**782. ADJACENT** ఆనుకోని, ప్రక్కనే
My house in **adjecent** to the park.
నా యిల్లు ఉద్యానవనానికి ప్రక్కనే ఉంది.

**783. IN ADEQUATE** చాలని, సరిపడని
The funds raised by the public are **in adequate** for the construction if an Ashrams here.
ఆశ్రమ నిర్మాణానికి ప్రజలనుండి నిధులు సేకరించారు.

**784. ADD FUEL TO FIRE** పరిస్థితిని విషమింప చేయు
Pakistan is **adding fuel to fire** by abetting terrorism in kashmir valley.
కాశ్మీర్ లోయలో ఉగ్రవాదాన్ని ప్రోత్సహిస్తూ పాకిస్థాన్ పరిస్థితులు విషమింప చేయవచ్చు.

**785. TO LEND AM ARM** సహాయపడు
It is our duty **to lend an arm** to the old man
ఆ మదుసలికి చేయూతనివ్వటం మన కర్తవ్యం.

**786. TO LEND AN EAR** చెవి వొగ్గు (విను)
It is our duty **to lend an ear** to the teacher.
ఉపాధ్యాయుడు చెప్పేది వినటం (చెవివొగ్గటం) మనవిధి.

**787. ACCOUNTABLE** లెక్క చెప్పవలసి ఉండు.
You will be **Accountable** for the deal to your boss.
నీ యజమానికి ఈ వ్యవహారంలో నీకు లెక్క చెప్పవలసి వుంటుంది.

**788. TO BE ALERT** అప్రమత్తంగా (జాగ్రత్త) ఉండు
One has **to be alert** at the time of Travelling.
ప్రయాణం చేసే సమయంలో అప్రమత్తంగా ప్రతి ఒక్కరూ ఉండాలి.

**789. MAKE AMENDS**సరిదిద్దుకొను
The boy **made amends** for his rude behaviour.
పిల్లవాడు (బాలుడు) తన ప్రవర్తనను మార్చుకున్నాడు.

790. **GO AMISS** లెక్క చెయ్యకపోవు

Im pite of the advice of the teachers the boy **went a miss** and failed in the examination.

ఉపాధ్యాయుని సలహా తప్పుగా భావించి విద్యార్థి లెక్కచెయ్యని కారణంగా పరీక్షలో తప్పాడు.

791. **TAKE A MISS** తప్పుగా భావించు

Never **take a miss** the good words of elders.

పెద్ద వారి మంచి మాటలను తప్పుగా భావించకు.

792. **A STORM IN A TEA CUP** అంతగా ప్రాధాన్యత లేని విషయం

Lalu's jail and bail is **a storm in a tea cup.**

లాలూ జైలు, బైలు మామూలే. దానికంత ప్రాధాన్యత లేదు.

793. **KEEP ALOOF** దూరముగా ఉండు

Always **keep aloof** from Gutkas

ఎల్లప్పుడూ గుట్కాలకు దూరంగా ఉండు.

794. **BEAR THE BRUNT** కష్టాన్ని భరించు

**I bear the brunt** of our family expenditure.

నేను నా కుటుంబాన్ని పోషించడానికి ఎంతో కష్టపడుతున్నాను.

795. **BEAR FRUIT** ఫలించు, సత్ఫలితము నిచ్చు

Your efforts will always **bear fruit.**

నీ ప్రయత్నం ఎప్పుడూ సత్ఫలితాన్ని యిస్తుంది.

796. **TURN FROM BAD TO WORSE** క్షీణించు

The event is **turning from bad to worse** day by day.

పరిస్థితి రోజురోజుకు క్షీణిస్తోంది.

797. **FLATTER** ముఖస్తుతి చేయు

A false friend **flatters** thee to axe his grind.

కపట స్నేహితుడు తన స్వలాభానికి నిన్ను యింద్రుడు, చంద్రుడు అని పొగుడుతాడు.

798. **ALIVE** తెలిసి ఉండు

The Government of Andhra Pradesh is fully **alive** of the drought situation in the state.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి రాష్ట్రంలో నెలకొన్న దుర్భిక్ష పరిస్థితి బాగా తెలుసు.

**799. AVAIL ONE SELF OF** వినియోగించుకొను

**I availed my self of** his relation with minister

నేను మంత్రితో అతనికున్న బంధుత్వాన్ని వినియోగించుకున్నాను.

**800. ALIEN** దూరం తెలియని

Cowardice is **alien** to the Rajaputs.

పిరికితనం రాజపుత్రులకు తెలియదు.

**801. ARCHITECT** నిర్మాత

Man is the **architest** of his own fortune.

ప్రతి మనిషి తన అదృష్టాన్ని తానే నిర్ణయించుకోవాలి.

**802. ASSOCIATE WITH** సంబంధము పెట్టుకొను

Never **associate** your self with bad company.

చెడ్డ వారితో ఎన్నడూ స్నేహం చెయ్యకు.

**803. ENTER INTO** ప్రవేశించు

Don't **enter into** argument with me

నాతో వాదనకు దిగవద్దు

**804. KEEP AT AN ARM'S LENGTH** దూరం ఉంచు

Keep him **at an arm's length.**

అతనిని ఆమడ దూరంలో ఉంచు.

**805. BRING TO BOOK** కేసు పెట్టు

Passengers who travel without avalid ticket will **brought to book** by the ticket examiner.

సరియైన టిక్కెట్టు లేకుండా ప్రయాణం చేసేవారిని టిక్కెట్ చెక్ చేసే అధికారి పట్టుకొని కేసు పెట్టటం జరుగుతుంది.

**806. STUMBLING BLOCK** అవరోధము (ఆటంకము)

Want of proper education is a **stumbling block** in one's career.

సరియైన విద్యలేక పోవటం ఒకరి జీవితంలో పెద్ద అవరోధం.

**807. BID FARE WELL** వీడ్కోలు పలుకు

The staff **bade fare well** on the eve of my father's retirement.

నా తండ్రి పదవి విరమణ సందర్భంగా స్టాఫ్ వీడ్కోలు యిచ్చారు.

**808. BEWARE OF** అప్రమత్తంగా ఉండు

One should **beware of** pick pockets.

జేబు దొంగల పట్ల ప్రతి ఒక్కరూ అప్రమత్తంగా ఉండాలి.

**809. BETWEEN DEVIL AND DEEP SEA** చిక్కులో పడు

Osama bin laden now finds himself in **between the devil and deep sea.**

ఒసామిన్ బిన్ లాడెన్‌కు ముందు నుయ్యి వెనుక గొయ్యిలా ఉంది.

**810. BETTER HALF** భార్య

She is my **better half.**

ఆమె నా భార్య.

**811. IMPROVE ONE'S POSITION** పరిస్థితిని మెరుగు పర్చుకొను

He **improved his position** in life by sheer industry (hard work)

ాతను కేవలం నిరంతర పరిశ్రమ కారణంగానే, జీవితంలో పైకి వచ్చాడు.

**812. BESTOWED** అనుగ్రహించిన, దయ చేసిన

Showers of blessing of God **bestow** the wórld.

భగవంతుని దీవెనలు లోకాన్ని అనుగ్రహిస్తాయి.

**813. DO ONE'S BEST** సాధ్యమైనంత చేయు

We have to **do one duty that is best.**

మనం మన కర్తవ్యాన్ని నిర్వర్తించాలి.

**814. MAKE BELIEVE** మోసము, నటన

The tall take of politicians is a **make believe.**

రాజకీయనాయకుల పెద్ద పెద్ద వాగ్దానాలు నీటి మూటలు.

**815. CARRY AWAY BY** నమ్ము, విశ్వసించు

Don't be **carried away by** rumours.

గాలి వార్తలు నమ్మవద్దు.

**816. CALL A SPADE A SPADE** ఉన్నది ఉన్నట్లుగా చెప్పు

He learned a number of enemies than friends because he **called a spade a spade**

ఉన్నది ఉన్నట్లుగా మాట్లాడినందున అతనికి స్నేహితులకన్నా విరోధులే ఎక్కువయ్యారు.

**817. CALL FOR AN EXPLANATION** వివరణ కోరు

The collector **called for the explanation** from the MRO for his develiction of his duties.

మండల రెవిన్యూ అధికారి విధి నిర్వహణలో అశ్రద్ధ చూపినందున కలెక్టర్ ఆయన్ను సమాధానం కోరారు.

**818. BY THE BY** అన్నట్లు

**By the by** I forgot to tell you I got a good job.

అన్నట్టు చెప్పడం మరిచా నాకు మంచి ఉద్యోగం దొరికింది.

**819. BY ALL MEANS** అన్ని విధాలా, నిరభ్యంతరంగా

You are **by all means** welcome to my house at any time.

నీవు ఎప్పుడైనా సరే మా యింటికి నిరభ్యంతరంగా రావచ్చు, స్వాగతం పలుకు.

**820. BURN ONE'S FINGERS** చేతులు కాల్చుకొను (నష్టపోవు)

The merchant **burn his fingers** by dealing in drugs.

మాదక ద్రవ్యాల వ్యాపారంలో వర్తకుడు వేలు కాల్చుకున్నాడు. (నష్టపోయాడు)

**821. IN BRIEF** సంక్షిప్తంగా, సంగ్రహంగా

The story of Mahabharata **in brief** is the moral of victory over the evil.

మహా భారతం కథ సంగ్రహంగా చెడు పైన మంచి విజయంగా భావించాలి.

**822. BE WITHIN BOUNDS** అదుపులో ఉండు

One must **be within bounds** in matters in squandering money.

డబ్బు విచ్చల విడిగా ఖర్చు చేసే వాళ్ళు తమ పరిధుల్ని గమనించాల్సి ఉంటుంది.

**823. COINCIDE** ఏకకాలంలో సంభవించు

Gandhijis birth day and lal Bhadur Sastry's birthday **coincide** every year.

ప్రతి సంవత్సరం గాంధి గారి పుట్టిన రోజు లాల్ బహదూర్ శాస్త్రి పుట్టిన రోజు ఒకే రోజు సంభవిస్తాయి.

**824. FILL THEIR COFFERS** పెట్టె నింపుకొను, డబ్బు సంపాదించు

Traders are generally eager to **fill their coffers** by black marketing.

వ్యాపారులు సాధారణంగా బ్లాక్ మార్కెటింగ్ (వస్తువులను దాచి ఉంచారు) ద్వారా తమ గల్లా పెట్టెలు నింపుకోవాలని చూస్తుంటారు.

825. **A TERN COAT** చొక్కాలు మార్చినట్టు తరుచుగా పార్టీలు మార్చేవాడు.

Some politicians **tern coats** to gain their own ends.

తన స్వప్రయోజనం కోసం కొంతమంది రాజకీయనాయకులు చొక్కాలు మార్చినట్లు పార్టీలు మారుస్తుంటారు.

826. **IN THE CLUTCHES OF** కబంధ హస్తాలలో

The Hindi film industry is now **in clutches of** mafia.

మాఫియా కబంద హస్తాల్లో హిందీ చిత్ర పరిశ్రమ ఇప్పుడు చిక్కుకుని ఉంది.

827. **CHALK OUT A PROGRAMME** ప్రణాళిక సిద్ధము చేయు

We **chacked out a programme** for the excevious to Amaravathi

అమరావతి విహార యాత్రకు తగిన ప్రోగ్రాం తయారు చేశాం.

828. **MIX WITH** కలియు, చేరు

Be cautious of **mixing with** false friends

కపట స్నేహితులతో కలిసి తిరిగేటప్పుడు జాగ్రత్తగా ఉండాలి.

829. **CATCH RED HANDED** నేరము, తప్పు చేస్తూ ఉండగా పట్టుకొను

The ACB caught the food inspector **red handed** while receiving bribe to do some favours.

ఒకరికి లాభం చేకూర్చటం కోసం లంచం తీసుకుంటూ ఉండగా ఆహార తనిఖీ అవినీతి నిరోధకశాఖ వారు పట్టుకున్నారు.

830. **INSPITE OF** అయినప్పటికినీ

I have to carry on my efforts **inspite of** hurdles

అడ్డంకులు సంభవించినా నేను నా ప్రయత్నాలు కొనసాగించాలి.

831. **RESORT TO** అనుసరించు

We should not **resort to** violence at any cost.

ఎట్టి పరిస్థితులోను మనం హింసకు తావీయరాదు.

832. **BE CONCIOUS OF** ఎరిగి యుండు, గ్రహించు

Public servants have **to be concious** of their duty to the public.

ప్రభుత్వ ఉద్యోగులు ప్రజల అవసరములు దృష్టిలో పెట్టుకొని, తమ విధుల్ని నిర్వర్తించాలి.

833. **CONCERNED FOR** ఆందోళన చెందు

He is very much **concerned for** his sister who is handicaped.

అతను అవిటి దైన తన చెల్లెలి కోసం ఎంతో ఆందోళన చెందుతున్నాడు.

834. **PROVE DISASTROUS** తీవ్ర నష్టం కలిగించు

If we jump to a conclusion on some issue some times it may **prove disastrous.**

మనం ఆలోచన లేకుండా ఒక నిర్ణయం తీసుకున్నప్పుడు ఒక్కోసారి అది నష్టదాయకంగా పరిణమించవచ్చు.

835. **COMPLY WITH** అంగీకరించు

The collector did not **comply with** formers request for an appointment.

రైతుల అభ్యర్ధనను కలెక్టర్ తిరస్కరించారు.

836. **COME ABOUT** సంభవించు

How did it **come about** is a mystery.

అది ఎలా జరిగిందో అంతుబట్టకుండా వుంది.

837. **COME OFF WITH FLYING COLOUR** విజయం సాధించు

Our Jawans **came off with flying colours** with Pakistan in Kargil war.

మన జవాన్లు కార్గిల్ యుద్ధంలో పాకిస్థాన్ పై విజయం సాధించారు.

838. **DEFEAT THE PURPOSE** ఉద్దేశ్యము (ఆశయము) నెరవేరక పోవు

Negligence of character formation **defeat the very purpose** of education.

వ్యక్తిత్వ (శీల) వికాసానికి దోహదం చెయ్యని విద్య తన ప్రధాన లక్ష్యాన్ని కోల్పోతుంది.

839. **DEAL WITH** వ్యవహరించు, చర్య తీసుకొను

The teacher **deal with** the mischievous boy aptly (brought him round).

ఉపాధ్యాయుడు తుంటరి పిల్లవాని విషయంలో గట్టి చర్యతీసుకున్నాడు.

840. **ORDER OF THE DAY** సర్వ సామాన్యము

Striks, bandhs, rasta rokos have become the **order of the day.**

సమ్మెలు, బంధులు, రాస్తారోకోలు సర్వసామాన్యమైనవి.

841. **RED LETTER DAY** బంగారు అక్షరాలతో లిఖించ దగిన

August, 15th is the **red letter day** in the history of India.

15 ఆగస్టు భారత చరిత్రలో సువర్ణాధ్యాయం.

842. **A CRY IN THE WILDERNESS** అరణ్యరోదన

Her appeals became **a cry in the wilderness** before the sadist husband.

క్రూరుడైన భర్త ముందు ఆమె అభ్యర్థనలు అరణ్యరోదన అయ్యాయి.

843. **TO CHEW THE CUD** నెమరువేయు

It is quite natural **to chew the cud** of one's child hood memories.

ప్రతి ఒక్కరూ బాల్య స్మృతులను నెమరువేసుకోవటం ఎంతో సహజం.

844. **CUT A SORRY FIGURE** ముఖం వ్రేలాడు (సంతోషం లేకపోవు)

Prabhakar has to **cut a sorry figure** in an intarview for want of preparation.

ప్రభాకర్ తయారవనందువల్ల ఇంటర్వ్యూలో ముఖం వ్రేలాడేశాడు.

845. **COMING TO** అర్పించు

The mortals of NTR the departed leader were **coming to** flamer.

మరణించిన నాయకుడు ఎన్.టి.ఆర్. పార్థివ శరీరం అగ్నికి ఆహుతి అయింది.

846. **TO GET AREQUAINTED WITH** పరిజ్ఞానము కలిగియుండు

We have **to be get arequinted with** spoken English in order to lean English.

ఇంగ్లీషును నేర్చుకోవాలంటే ముందుగా ప్రతి ఒక్కరూ ఇంగ్లీష్ మాట్లాడటం విధిగా నేర్చుకోవాలి.

847. **AT ONE'S WITS END** చలించిపోవు

On reading Antonio's letter, Bansania was **at his wit's end.**

ఆంటోనియా ఉత్తరం చదివిన బెస్సానియో చలించిపోయాడు (ఆంటోనియా త్యాగానికి)

848. **PUT AN END TO** అంతమొందించు, నిర్మూలించు

Please **put an end to** this bledy game.

ఈ దరిద్రపు ఆటని యిక ఆపెయ్యండి.

849. **EAT HUMBLE PIE** ఓటమిని అంగీకరించు

He **ate humble pie** and agreed to run half nackedly.

అతను ఓటమిని అంగీకరించి అర్థనగ్నంగా పరిగెత్తడానికి ఒప్పుకున్నాడు.

850. **IN DEBTED TO** ఋణపడి ఉండు

We are greatly **indebted to** our mother and mother land.

మనం మనకన్న తల్లి, మాతృదేశానికి ఎంతో ఋణపడి ఉన్నాము.

851. **GO TO DOGS** పాడైపోవు

All arrangements went **to dogs** due to the rain.

ఆ వర్షం కారణంగా ఏర్పాట్లన్నీ నాశనం అయిపోయాయి.

852. **DELIVER THE GOODS** పనిచేయు, ఉపయోగపడు

He is the gentle man who **delivers the goods** for others

ఇతరులకు ఉపయోపడేవాడే నిజమైన పెద్దమనిషి.

853. **GO OUT OF HAND** చెయ్యిజారిపోవు, అదుపుతప్పు

As the situation **got out hand** principal called upon police

పరిస్థితి చెయ్యి జారిపోతుండగా ప్రిన్సిపాల్ పోలీసులకు కబురు చేశారు.

854. **GET OVER** బయటపడు

I **got over** all my troubles and hurdles with courage and confidence.

నేను నా సమస్యలు, అవరోధాలను ధైర్యంతో విశ్వాసంతో అధిగమించాను.

855. **TAKE TIME BY THE FORELOCK** అందుకొను

He who **takes times by the forelock** is service to get success in life.

వచ్చిన అవకాశాన్ని చేజిక్కించుకున్న వాడు జీవితంలో విజయం తప్పక సాధిస్తాడు.

856. **A FEAST TO THE EYE** కనువిందు చేయు

Beauty of the picture is **a feast to the eye.**

ఆ చిత్రం యొక్క అందం కనులకు విందుగా వుంది.

857. **TO FALL IN LINE** వరుసక్రమంలో నిలబడు

The NCC Cadets **fell in line** as per the Instructions of the commandor.

కమాండర్ ఆజ్ఞననుసరించి NCC క్యాడెట్‌లు వరుసలో నిలబడ్డారు.

858. **FALL IN LOVE** ప్రేమలో పడు

Damayanthi **fell in love** with Nala at first sight.

దమయంతి నలుని తొలిచూపులోనే ప్రేమించెను.

859. **FALL SHORT OF** తగ్గు (తక్కువగా ఉండు)

Jyothi **fell short of** one mark in maths to pass the examination.

జ్యోతి ప్యాసవటానికి లెక్కల్లో ఒక్క మార్కు తగ్గినది.

860. **TAKE EXCEPTION** తప్పుగా భావించు

Don't **took exception** to my words

నా వ్యాఖ్యలకు తప్పుగా భావించకు.

OOO